Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 33 • 13-8-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## ఆమెకెందుకో... అంత కక్ష?

కాంగ్రెస్‌తో జగన్ బంధం తెగకుండా ఏదో ఒక రకంగా కొనసాగించాలని కొందరు ప్రయత్నిస్తుంటే, మరికొందరు మాత్రం ఎట్లయినా జగన్‌ను అణిచి వేయాలనే పట్టుదలతో పని చేస్తున్నారు ఢిల్లీలో. ఈ రెండో కోవలో ప్రధాన పాత్ర మన పనబాక లక్ష్మి గారిది కావడం గమనార్హం. జగన్‌కు ముక్కుతాడు వేసి పట్టి పెట్టకుంటే తమబోటి వారికి రాజకీయ భవిష్యత్తే వుండదని అందరి దగ్గర వాపోతున్నారామె. జగన్ చర్యల వల్ల రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ చాలా నష్టపోతుందని, దీన్ని ఇంకా అనుమతిస్తే తనబోటి వారు ఎన్నికలలో నిలబడి పోటీ చేయడమే వ్యర్థమై పోతుందని, సాధ్యమైనంత త్వరగా జగన్‌ను పార్టీ నుంచి సాగనంపడమో, లేదంటే అణిచి వేయడమో చేయాలని వాదిస్తున్నారట ఆమె. మరొక కేంద్ర మంత్రిణి పురంధరేశ్వరి సైతం ఈ విషయంలో పనబాకకు సంఘీభావం తెలపడం విశేషం. జగన్ విషయంలో వీరిద్దరిదీ ఒకే మాటగా నడుస్తున్నది ఢిల్లీలో. జగన్ స్వంత పార్టీ పెడితే కాంగ్రెస్ మిగలదని, ఆయనకు ఆ అవకాశం రాకుండా అడ్డుకోవాలన్నది వీరి భావన. పనబాక లక్ష్మి కేంద్రమంత్రిగా ఎదగడంలో వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ప్రమేయం కూడా ఎంతో కొంత వుంది. 2009 ఎన్నికలలో ఆమె భర్త

కొరవ 14వ పేజీలో

### అమీతుమీకి తెగబడుతున్నారు

# ఇరువైపుల చురకత్తులే!

కాంగ్రెస్‌లో వర్గ పోరు ముదిరి పాకాన పడుతున్నది. యాదవ కులంలో ముసలంలా కుమ్ములాటలతో కొంప కొల్లేరుగా మారుతున్నది. వైఎస్ మరణానంతరం వైఎస్.జగన్ దుందుడుకుతనాన్ని, ఆకతాయి చేష్టలను పదకొండు నెలల పాటు ఓర్పుగా సహించింది అధిష్టానం. ఏదో ఒక రకంగా దారిలోకి తెచ్చుకోవచ్చునని భావించింది. సామ దాన బేధోపాయాలు మూడింటినీ ప్రయోగించింది. "పతి ప్రాణంబు దక్క...." అన్నట్లు, ముఖ్యమంత్రి కుర్చీ తప్ప మరేమీ అడిగినా ఇవ్వడానికి సుముఖత చూపింది. ఇక మిగిలింది దండోపాయం మాత్రమే. అది ఇప్పుడు మొదలైంది.

జగన్ కూడా తక్కువేమీ తినలేదు. నేనడిగింది ఇవ్వనప్పుడు, ఇంక మీతో నాకేమి పని అన్న ధోరణిలో అధిష్టానాన్ని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగిస్తున్నాడు. వద్దన్నా ఓదార్పు యాత్ర చేశాడు. మళ్లీ కూడా మొదలు పెడతానని ప్రకటిస్తున్నాడు. తన వర్గం ఎమ్మెల్యేలతో రోజుకొక ప్రకటన చేయించి, ముఖ్యమంత్రి రోశయ్యను బజారున పెడుతున్నాడు. తన సాక్షి పత్రిక, టీవీ ఛానళ్లలో ప్రభుత్వ వ్యతిరేక ప్రచారాన్ని ఊదరగొడుతున్నాడు. ఢిల్లీ పెద్దల హితోక్తులను పెడచెవిన పెడుతున్నాడు. తాను మౌనంగా వుంటూనే అధిష్టానాన్ని అన్నివిధాల రెచ్చగొడుతున్నాడు.

కాంగ్రెస్‌ను ధిక్కరిస్తే, జగన్‌ను ఆర్థికంగా క్రుంగదీయడానికి, కుంభకోణాల వెలికితీతతో ఇరుకున పెట్టడానికి ప్రయత్నం జరుగుతుందని మొదట నుంచి అందరూ అనుకుంటున్న మాట. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి హయాంలో జరిగిన వేల కోట్ల రూపాయల గోల్మాల్ వ్యవహారాలపై ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ దగ్గర పత్రాలతో సహా వివరాలన్నీ వున్నాయని, అవసర మొచ్చినప్పుడు వాటిని పాశుపతాస్త్రం వలె వాడుతారని అభిప్రాయపడుతుండినారు. ఇప్పుడదే నిజమైంది. జగన్ ఆర్థిక మూలాలను అదిమిపెట్టే ప్రక్రియలో మొదటగా గాలి జనార్దనరెడ్డి మీద ఒత్తిడి పెంచారు. ఓబుళాపురం ఇనుప ఖనిజం గనుల దోపిడీకి అడ్డుకట్ట వేశారు. ఆ వెంటనే తన అల్లుడు బ్రదర్ అనిల్ కుమార్‌కు వైఎస్ వరకట్నంగా సమర్పించిన బయ్యారం గనుల కుంభకోణాన్ని వెలికి తీస్తున్నారు. ఇప్పుడు తాజాగా ఎపీఐఐసీ భాగోతాలను బయట పెడుతున్నారు.

వైఎస్ హయాంలో ఎపీఐఐసీ ఒక అవినీతి గని వలె పని చేసింది. పారిశ్రామికులు, వ్యాపారులకు వేలాది ఎకరాలను వుప్రవుడియంగా అప్ప చెప్పడానికి, ఆ లావాదేవీలలో తమ వాటాగా పెద్ద పెద్ద డబ్బు మూటలు జవురుకోవడానికి ఈ ప్రభుత్వ రంగ సంస్థను ఒక పావుగా వాడుకొన్నారన్నది బహిరంగ రహస్యం. పారిశ్రామికులు ముందుగా తమకు ఎక్కడ ఎంత భూమి కావాలో గుర్తించి, ప్రభుత్వ పెద్దలతో బేరం కుదుర్చుకొంటారు. ఆ వెంటనే ఎపీఐఐసీ రంగంలోకి దిగిపోతుంది. బేరం కుదుర్చుకొన్న వారి కోరిక మేరకు రైతులను బలవంత పెట్టి, బెదరించి మరీ భూమిని సేకరిస్తుంది. ఆ వెంటనే దాన్ని వారి పేరిట బదలీ చేస్తుంది. ఈ క్రమంలో కొన్ని వేల కోట్లు చేతులు మారాయని చెప్తారు. హైదరాబాద్ నగరంలో కోట్లు ఖరీదు చేసే భూములను సైతం ఇట్లనే పారిశ్రామికులకు దఖలు పరిచాడు వైఎస్. వాటిలో ఒకటి ఎమ్మార్

కొరవ 14వ పేజీలో

# మైనింగ్ మాఫియా దౌష్ట్యం

బళ్లారి మైనింగ్ మాఫియా దేశానికి అతి పెద్ద సవాలుగా మారుతున్నది. ప్రకృతి ప్రసాదిత సంపదను కొద్దిమంది దోపిడీదారులు గుప్పెట్లో పెట్టుకొని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను ఒక ఆట ఆడిస్తున్నారు. జాతీయ రాజకీయాలను ప్రభావితం చేస్తున్నారు. చట్టాలను, న్యాయస్థానాలను పరిహసిస్తున్నారు.

బళ్లారి జిల్లాలో రమణ్‌దుర్గా అనే పర్వత పంక్తి వుంది. ఈ శ్రేణుల ఉత్తరభాగంలో 13వేల ఎకరాల విశాలమైన భూమి మొత్తం ఇనుప ఖనిజపు గని. ఈ భూభాగంలో కనీసం 120 కోట్ల టన్నుల ఇనుప ఖనిజం వుందని అంచనా. స్వాతంత్ర్యానికి పూర్వమే దీన్ని గుర్తించి, త్రవ్వకాలు మొదలు పెట్టారు. అయితే అప్పట్లో దీనికి పెద్ద విలువ వుండేది కాదు. 2004 సంవత్సరం వరకు కూడా ఒక టన్ను ఐరన్ ఓర్‌కు అంతర్జాతీయ మార్కెట్లో 17 డాలర్లకు (800 రూపాయలకు) మించి ధర పలికేది కాదు. కానీ 2005 సంవత్సరంలో చైనా వ్యాపారులు ఒక్కసారిగా ధరను 60 డాలర్లకు (దాదాపు మూడువేల రూపాయలు) పెంచారు. ఒక టన్ను ఖనిజం త్రవ్వకానికి వందల రూపాయలకు మించి ఖర్చు కాదు. ప్రభుత్వానికి చెల్లించవలసిన రాయల్టీ కేవలం 25 రూపాయలు మాత్రమే. తతిమాదంతా గని యజమాని లాభం. దానితో ఎక్కడెక్కడి వారు బళ్లారి మీద వాలిపోయారు. రాజకీయ పలుకుబడి ప్రయోగించి వీలైనంత విస్తీర్ణంలో గనులను సంపాదించారు. ఇష్టానుసారం త్రవ్వకాలు జరిపి, వందల వేల కోట్ల రూపాయలు మూటగట్టుకొన్నారు. అంత డబ్బు ఒక్కసారిగా తమ ఇళ్లలో పోగుపడడంతో ఈ గని యజమానులెవరికీ కన్ను మిన్ను కానరాలేదు. ఒక్కొక్కరు ఒక్కొక్క మాఫియా డాన్ వలే తయారయ్యారు. కాంగ్రెస్, బిజెపి, జనతాదళ్ పార్టీలు మూడింటినీ శాసించే స్థాయికి ఎదిగారు. అట్లా పుట్టుకొచ్చిన వాడే గాలి జనార్ధనరెడ్డి. ఈ గని యజమానులు దురాశకు పోయి, తమకు కేటాయించిన భూమిలో కంటే అధికంగా అడవులను ఆక్రమించి త్రవ్వి పారేస్తున్నారు. మరొకప్రక్క చిన్న చిన్న గని యజమానులను బెదిరించి, భయపెట్టి వారి గనులూ ఆక్రమిస్తున్నారు. లేదంటే టన్నుకు ఇంత అని రౌడీ మామూలు దండుతున్నారు. ఖనిజం రవాణాకు కూడా అన్నీ అడ్డదారులే. పర్యావరణ పరిరక్షణ నియమాలకు తిలోదకాలిస్తున్నారు. బళ్లారి నుంచి అటు మంగుళూరు వరకు, ఇటు కృష్ణపట్నం వరకు కాలుష్యాన్ని సృష్టిస్తున్నారు. వీరి జీవన శైలి చూస్తే, బిల్‌గేట్స్ వంటివారు కూడా అసూయ పడాల్సిందే. బళ్లారిలో వున్నన్ని హెలికాప్టర్లు ప్రపంచంలోని మరే జిల్లాలో లేవంటే, వీరి నడమంత్రపు సిరి ఎంత వికృతంగా వుందో అర్థం చేసుకోవచ్చు. కర్నాటక రాష్ట్ర రాజకీయాలు ఈరోజు బళ్లారి మైనింగ్ మాఫియా కనుసన్నలలో నడవక తప్పని దుస్థితి. కాంగ్రెస్, బిజెపి, జనతాదళ్ పార్టీలు మూడింటిలో అదే పరిస్థితి.

ఈ మాఫియా భూతాన్ని నియంత్రించడం కర్నాటక ముఖ్యమంత్రి యడ్యూరప్ప తరం కావడం లేదు. తమ రాష్ట్రంలోని ఓడ రేవులన్నిటిలో ఇనుప ఖనిజం ఎగుమతిని నిషేధించినా, తమ రాష్ట్ర సరిహద్దులు దాటి రవాణా చేయరాదని నిర్దేశించినా మైనింగ్ మాఫియా లెక్క చేయడం లేదు.

జమీన్‌రైతు

మైనింగ్ మాఫియా వల్ల మూడు ప్రధాన నష్టాలున్నాయి. మొదటిది జాతి మొత్తానికి చెందవలసిన సహజ సంపద కొద్ది మందిని కుబేరులుగా మార్చడానికి దుర్వినియోగం కావడం. రెండవది, పర్యావరణానికి జరుగుతున్న నష్టం. మూడవది రాజకీయాలు డబ్బుమయంగా మారి ప్రజాస్వామ్యానికే జరుగుతున్న ప్రమాదం. ఈ సమస్యకు ఒకటే పరిష్కారం. ఇనుప ఖనిజం ఎగుమతులను ప్రభుత్వ రంగ సంస్థల ద్వారా మాత్రమే జరిపించాలని చట్టం చేయడం. అది కేంద్ర ప్రభుత్వ పరిధిలోని అంశం. వామపక్ష పార్టీలు చాలా కాలం నుంచి ఇందుకోసం ఒత్తిడి చేస్తున్నా కేంద్రం పట్టించుకోవడం లేదు. కర్నాటక రాజకీయాలు మైనింగ్ మాఫియా కారణంగా భ్రష్టు పడుతున్న తీరు చూసిన తర్వాత అయినా ప్రధాని మన్మోహన్‌సింగ్ ఒక నిర్ణయానికి రాలేకపోవడం విచారకరం. ఈ విషయంలో ఆయన ఇంకా మీన మేషాలు లెక్కపెడితే దేశ రాజకీయాలనే కలుషితం చేస్తారు గని యజమానులు. వారి అక్రమ సంపాదన సమాజం మీద తీవ్రమైన దుష్ప్రభావం చూపుతుంది. దేశహితం కోరి, ఇనుప ఖనిజం ఎగుమతులను తక్షణం నిషేధించడం కేంద్ర ప్రభుత్వ బాధ్యత.

## జనవాణి

### ఉపాధ్యాయుల తీరు మారాలి

గురుర్బ్రహ్మః అని ఆర్యోక్తి. అటువంటి ఉపాధ్యాయులు నేడు నానా కంగాళీలయ్యారు. క్రమశిక్షణ లేదు. వీరే కొన్నిచోట్ల విద్యార్థినుల పట్ల అపరకీచకుల్లా వ్యవహరిస్తున్నారు. మంచి ఉపాధ్యాయులు వుండే మన జిల్లాలోనూ కీచకులు, తోటి ఉపాధ్యాయులను నానా తిప్పలు పెట్టేవారు, డ్యూటీలు ఎగ్గొట్టి వ్యాపారాలు చేసేవారు ఎక్కువయ్యారు. ఈ విషయాన్ని జిల్లా కలెక్టర్ రాంగోపాల్ ఇటీవల ఓ సమావేశంలో ప్రస్తావించారు. ఉపాధ్యాయ లోకం తలవంపులు తెచ్చుకొంటే భావిభారత జాతిని ఎవరు తయారు చేస్తారు? సంస్కరిస్తారు?

కె.సుజాత, కావలి.

### ఉదయగిరికి పూర్వవైభవం తెండి!

శ్రీకృష్ణదేవరాయలు పట్టాభిషేక పంచమ శతాబ్ది వేడుకలతో ఉదయగిరి మళ్లీ వార్తల్లో వెలిగింది. ఉదయగిరి చరిత్ర గూర్చి ఎంత చెప్పినా ఇంకా మిగిలే వుంటుంది. ఉదయగిరి ఉత్సవాలను జరిపిన పెద్దలు ఇక్కడ తమ్మురాయలుచే నిర్మితమైన గోపాలస్వామి ఆలయంలో గోపాలకృష్ణుని విగ్రహాన్ని తెచ్చి పునః ప్రతిష్ఠ చేస్తే బాగుంటుంది. అదేవిధంగా రంగనాయకులస్వామి గుడిలో తిరిగి రంగనాయకులస్వామిని ప్రతిష్ఠింపజేయడం అక్కడి స్థానిక నేతలు, మన రాష్ట్ర ప్రభుత్వం కనీస కర్తవ్యం కూడ. ఉదయగిరి కొండలలోని వనమూలికల గూర్చి పరిశోధనలు జరపాలి. ఉదయగిరి కొండను పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చేయాలి.

ప్రొఫెసర్ నాగరాజారావు, హైదరాబాద్

### అర్థంకాని సమస్యలు!

టీవీ, పేపర్లలో వార్తలు చూస్తుంటాము. ఫలానా దగ్గర పేకాడుతున్న కొంతమందిని అరెస్ట్ చేశారని వారి వద్ద నుంచి 10 సెల్‌ఫోన్లు, ఆరు మోటారు సైకిళ్లు స్వాధీనం చేసుకొన్నారని రాస్తుంటారు. కోడి పందాలు ఆడే వారి వద్ద కూడా పుంజులు, డబ్బుతోపాటు సెల్‌ఫోన్లు, మోటారు సైకిళ్లు ఎందుకు స్వాధీనం చేసుకొంటారో అర్థం కాదు. గంజాయిని తీసుకువెళ్తుండిన కారును స్వాధీనం చేసుకొని కోర్టు లేదా పోలీస్ స్టేషన్‌లో వుంచుతారు. అదే బంగారు బిస్కట్లు దొరికితే ఫలానా విమానంలో పట్టుకొన్నామంటారు కానీ విమానాన్ని స్వాధీనం చేసుకోరు. ఆర్టీసి బస్సు కారును ఢీకొంటే కారు యజమాని పెట్టాల్సి

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

16-8-1940
పేజీలు : 16 వెల: అణా

### అమ్యూజ్‌మెంట్సు

పై పేరుతో సంతపేటలో ఒక జూదపుశాల ప్రారంభమైంది. ఇట్టిదే వెనుక ఒక మాటు ప్రారంభించబడి వీటిని జూదపుశాలలుగా గుర్తించి లైసెన్సులు రద్దు చేశారు. అట్టి దాన్ని తిరుగా ప్రారంభించడం, వారు యుద్ధ ఫండుకు నెలకు రూ.1000లు ఇవ్వడం, ప్రభుత్వం లైసెన్సు ఇవ్వడం విచారకరం.

వెంటనే దీన్ని రద్దు చెయ్యకపోతే దొంగతనాలు, మోసాలు వృద్ధి కాగలవని పోలీసు చెవులో చెపుతున్నాను. వినండి, వినకపోండి.

### బుచ్చి బోర్డు

20 యేండ్లుగా వున్న సాలారుద్దీన్ సాహెబు పాపం! సస్పెండు చేయబడ్డాడు. ఇతడు నిరుపేద. తిండికే జరుగదు. పేదవాడు ప్రెసిడెంటుగా వచ్చాడు గదా అన్న సంతోషం యిలా పరిసమాప్తమౌచున్నందుకు విచారము.

–హితైషి

### తెలుగు స్టూడియో న్యూస్

నాగమ్మ: ఇద్దరు నాగమ్మలు. ఒక నాగమ్మ షూటింగ్ జరుగుతున్నది. రెండవ నాగమ్మ రెడ్డిగారి బిడ్డ. ఒక వరస సొమ్ము చేయించి పెట్టందే రెడ్డిగారి అమ్మాయి అడుగు పెట్టదు.

ఆంధ్రదేశాన్ని లూటిజేస్తుందేమో ఈ బాలనాగమ్మ.

***

మీరాబాయి : కృష్ణ పూజా విధానానికి ఎన్ని ఆవాంతరాలు కలిగినా ఆ భక్తురాలు మానుతుందా? మళ్లీ దిగ్విజయంగా సాగుతున్నది ఆమె పూజ.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

12-8-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### బొగ్గు కొరతతో ఫ్యాక్టరీ మూత

బొగ్గు కొరత కారణంగా నెల్లూరు పింగాణి ఫ్యాక్టరీని (ఇండియా సిరమిక్సు లిమిటెడ్) 15-8-60 నుండి మూసివేయుటకు మేనేజిమెంటు నిర్ణయించింది. దీనివల్ల ఫ్యాక్టరీ యాజమానులకు నెలకు వచ్చే 20వేల రూపాయల నష్టం అటుంచి, 300మంది వుద్యోగులు, కార్మికులు నిరుద్యోగులౌతారు.

జనవరి 1తేది నుండి జూలై ఆఖరు వరకు 90 వ్యాగన్ల బొగ్గు సరఫరా కావలసి వుండగా 29 వాగన్లు మాత్రమే సరఫరా అయింది. మూడు రోజులకు చాలే బొగ్గును మాత్రం చేత బట్టుకొని, యిక ఎంత మాత్రం ఫ్యాక్టరీని నిర్వహించడం సాధ్యం కాదనే వుద్దేశ్యంతో ఫ్యాక్టరీ యజమానులు ఈ నిర్ణయానికొచ్చారు. గత పది మాసాలలో గూడా, ఈ బొగ్గు కొరత వల్లనే, నాలుగుసార్లు మొత్తం 59రోజులు ఫ్యాక్టరీని మూసివేయడం గూడా జరిగింది.

### చేతి గడియారం చేయని పని లేదు

ఇక ముందు చేతి గడియారాలు కేవలం గంట, తేదీ చూపే సాధనాలుగా మాత్రమే వుండవు. అన్ని కార్యాలకు ఉపయోగపడేటట్లు అవి తయారు చేయబడుతున్నవి. అమెరికాలో ఒక కంపెనీ ప్రేమికులు ధరించుటకు ప్రత్యేకంగా ఒక గడియారాన్ని తయారు చేస్తున్నదట. అందులో ఒక గంట వుంటుంది. అది ధరించిన వ్యక్తి తన ప్రియురాలుకు వ్రాయుటకు వీలుగా, పున్నమికి ముందురోజు గంట కొట్టి జ్ఞాపకం చేస్తుందట. రోగి నాడి నిముషానికి ఎన్నిసార్లు కొట్టేది డాక్టర్లకు తెలుపుతుంది మరొక రకమైన వాచీ!

వివిధ ప్రదేశాలకు ఫోన్ చేయవలసిన అవసరం గల వైమానికులకు, 24 నగరాలకు సంబంధించి స్థానిక కాలాన్ని చూపుతుందట మరొక విధమైన గడియారం.

ఇంజనీర్లు ధరించుటకు ప్రత్యేకంగా తయారు చేయబడుతున్న గడియారం, క్లిష్టమైన లెక్కాపక్కను క్షణంలో చేసి పెడుతుందట. ఈ విధంగా ఆధునిక చేతి గడియారం చేయని పనిఅంటూ వుండదు.

# నెల్లూరు ముచ్చట్లు

## ప్రధాని రాక!

నెల్లూరు జిల్లా సరిహద్దు గ్రామం మన్నవరంలో విద్యుత్ ఉపకరణాల ఉత్పాదక సంస్థ 'భెల్'కు శంకుస్థాపన చేయను ప్రధాని మన్మోహన్‌సింగ్ ఈ నెల 30వ తేదీ తరలివస్తారన్నది తాజా సమాచారం. గత ఏడాది సెప్టెంబర్ 8వ తేది నుంచి ఇప్పటికి మూడుసార్లు ఈ శంకుస్థాపన కార్యక్రమం రద్దయ్యింది. ఈసారి తప్పక జరుగుతుందన్న ధీమాను తిరుపతి పార్లమెంట్ సభ్యుడు చింతా మోహన్ వ్యక్తం చేశారు.

## విలువ పోగొట్టుకొంటున్న విలేకరులు

నెల్లూరు నగరంలో ఎవరైనా ప్రముఖుల పర్యటన సందర్భంగా స్వీయ నియంత్రణలేని మీడియా మిత్రులు చేస్తున్న హంగామా అందరినీ పలుచన చేస్తుంది. 9వ తేదీ నెల్లూరు ప్రెస్‌క్లబ్‌లో జరిగిన చిరంజీవి ప్రెస్‌మీట్‌కు పెద్ద సంఖ్యలో విచ్చేసిన పత్రికా విలేకరులు, ఎలక్ట్రానిక్ ఛానళ్ల ప్రతినిధులు పద్ధతి పాడు లేకుండా పోటీపడి అడిగిన ప్రశ్నలకు ప్రెస్‌క్లబ్‌కు వచ్చిన అతిథి అసహనాన్ని వ్యక్తం చేశారు. ప్రెస్‌మీట్లు, సభలన్నా తేడా చూపకుండా ఊపిరి సైతం ఆడకుండా కెమెరాలతో దడికడుతున్న వైఖరి, వివిధ ఛానళ్లు, పత్రికల మధ్య పోటీలతో అందులో పనిచేసే సిబ్బంది ఒకరినొకరు కించపర్చుకొనేలా ప్రవర్తిస్తున్న తీరు చూసేవారికి ఏవగింపుగా వుంటుంది. దీనివల్లే గతంలో మాదిరి మర్యాద లేకుండా మీడియాను రాజకీయ పార్టీలు, అధికారులు, చివరకు ప్రజలు ఏవగించుకొంటున్నారు. తమ గుర్చి ఎవరు ఏమనుకున్నా పరవాలేదనే వైఖరిని మీడియా వీడి తాము ప్రజలకు జవాబుదారి అని భావిస్తేగాని వలువల్లా వీడిన విలువలు ఓ గాటన పడవు.

## పెద్ద బందోబస్తు లేదు!

ప్రజారాజ్యం పార్టీ అధ్యక్షుడు చిరంజీవి నెల్లూరు పర్యటన సందర్భంగా పోలీసులు ఆయనకు పెద్దగా బందోబస్తు ఏర్పాటు చేయలేదు. నెల్లూరు నగరంలో అయితే సిఐ, ఓ రోప్ పార్టీ, స్థానిక ఎస్ఐలు మాత్రమే బందోబస్తులో పాల్గొన్నారు. దీనివల్ల ఆయన పర్యటించిన ప్రతిచోటా తొక్కిసలాట, ఊపిరాడని పరిస్థితులు ఏర్పడ్డాయి. అభిమానులు, సందర్శకులు, సామాన్య జనం మరీ రెచ్చిపోయి ప్రవర్తించినప్పుడు చిరంజీవికి వ్యక్తిగతంగా భద్రత కల్పిస్తుండిన ప్రత్యేక సెక్యూరిటీనే వారిని లాగి పడేయడం జరిగింది. పర్యటనలో పొరపాట్లు, గందరగోళ పరిస్థితులు ఎదురైనప్పుడు చిరంజీవి స్వయంగా వాటిని సర్దుబాటు చేసుకొంటూ పోయారు. 9వ తేదీ సాయంత్రం పినాకినీ అతిథి గృహంలో తనను కలవను వచ్చిన ఓ మహిళా అభిమాని, ఆమె భర్తను పోలీసులు లాగేసిన వ్యవహారాన్ని చూసిన ఆయన జనం ఒత్తిడిలోనూ వారిని పిల్చి ప్రక్కన నిలబెట్టి మరీ ఫోటో తీయించారాయన.

## అమ్మాయి బుగ్గగిల్లిన వివేకా!

మహామహులున్న సభలో రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి మళ్లీ తుంటరి చేష్టకు పాల్పడి అందరూ ఆశ్చర్యపోయేలా చేశారు. 8వ తేదీ టౌన్ హాల్‌లో జరిగిన బెజవాడ గోపాలరెడ్డి స్మారక అవార్డు ప్రదానోత్సవ సభలో బిజెపి జాతీయ నేత వెంకయ్యనాయుడు, మాజీ గవర్నర్ వి.ఎస్.రమాదేవి, జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, భాషావేత్త యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, ఎస్పీ దామోదర్ వంటి వారుండగా ప్రార్థన చేసి వస్తుండిన యువతిని పిలిచి మరీ వివేకా బుగ్గ గిల్లారు. అంతటితో ఊరుకోలేదు. ఈ యువతికి మరోసారి జ్ఞాపికనిస్తూ ఇదే చేష్టకు పాల్పడ్డాడు. సభలో ఏ ఒక్కరూ వివేకా వికృతాన్ని ఖండించిన పాపాన పోలేదు. పైపెచ్చు చూస్తూ ఊరుకొన్నారు.



## గ్లామర్ బలం చూపిద్దాం!

నెల్లూరు రంగనాయకులపేటలోని సోమిశెట్టి వారి కళ్యాణ మండపంలో 9వ తేదీ జరిగిన అభిమానుల సమావేశంలో మెగాస్టార్ చిరంజీవి కాస్త హుషారుగా మాట్లాడారు. చిరంజీవికి గ్లామర్ తప్ప మరేమీ లేదంటున్నారు. గ్లామర్ అంటే ఏమిటో దాని వెనుక వుండే బలం ఏమిటో వారికి చూపిద్దామన్నారు. గ్లామర్‌తోనే తమిళనాడు ముఖ్యమంత్రిగా ఎమ్జీరామచంద్రన్, రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఎన్టీరామారావు రాణించలేదా అని ప్రశ్నించారు. అభిమానుల ఈలలు, చప్పట్లు నన్ను ఈ స్థాయికి తెచ్చాయి. అవి లేకుంటే నా ఊపిరి ఆగిపోతుంది. అభిమానుల అభీష్టం మేరకే ప్రజారాజ్యం పార్టీని స్థాపించానని చెప్పుకొచ్చారు. ఇటీవల రోడ్డు ప్రమాదంలో మరణించిన యువరాజ్యం ప్రధాన కార్యదర్శి, గూడూరు యువకుడు నిస్సార్ ఖాన్‌కు ఈ సమావేశంలో పెద్ద ఫోటో పెట్టి నివాళులర్పించడం అందరినీ అలరించింది.

## గౌరవ డాక్టరేట్లు!

అనంతపూర్ జెఎన్‌టియూ విశ్వవిద్యాలయం ఇద్దరు నెల్లూరీయులకు గౌరవ డాక్టరేట్లను ప్రకటించింది. వీరిలో ఒకరు సాంకేతిక విద్యాసంస్థల రూపశిల్పి డాక్టర్ ఐ.గోపాలరెడ్డి కాగా మరొకరు విఖ్యాత గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం. 14వ తేదీ జరుగనున్న విశ్వవిద్యాలయం స్నాతకోత్సవంలో రాష్ట్ర గవర్నర్ ఇ.ఎల్.నరసింహన్ ఈ డాక్టరేట్లు వీరికి అందిస్తారు.

విచిత్రమేమిటంటే ఐ.గోపాలరెడ్డి ఇదే యూనివర్సిటీ నుంచి పట్టభద్రుడై ఇక్కడే తన బోధనావృత్తిని సైతం మొదలెట్టారు. గత 50 ఏళ్లుగా ప్రొఫెసర్‌గా, ప్రిన్సిపల్‌గా, డైరక్టర్‌గా, వైస్‌ఛాన్సలర్‌గా పలు హోదాలను అత్యంత సమర్థవంతంగా నిర్వహించిన ఘనాపాటి ఆయన. 30వేల పాటలకు పైగా పాడి గిన్నిస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సులో స్థానం సంపాదించిన సుమధుర గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం కూడా బహుముఖ ప్రజ్ఞాశాలి. నటుడు, డబ్బింగ్ కళాకారుడు, నిర్మాత, పాడుతాతీయగా కార్యక్రమ ప్రయోక్తగా, రాష్ట్రవ్యాప్తంగా వందలాది మంది గాయనీగాయకులను వెలికితీసిన కృషీవలుడు. అసాధారణ ప్రతిభావంతులైన ఇద్దరు నెల్లూరీయులకు డాక్టరేట్లు రావడం జిల్లావాసులందరికీ ఆనందదాయకమనాలి.

## మద్యంపై మళ్లీ పోరాటం

రాష్ట్రంలో ఏరులై పారుతున్న మద్యపాన నియంత్రణకు నెల్లూరు నుంచే మళ్లీ పోరాటానికి తెలుగుదేశం పార్టీ సమకట్టింది. ఆదాయమే ధ్యేయంగా మద్యం విక్రయాలకు ప్రభుత్వం తెగబడుతున్నందు వల్ల ప్రజా జీవితం అస్తవ్యస్తమయ్యిందని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి అభిప్రాయపడుతున్నారు. గతంలో సోమిరెడ్డి నాయకత్వాన విజయవంతంగా సారా వ్యతిరేక పోరాటాన్ని చేపట్టిన స్ఫూర్తితో 16వ తేదీ నెల్లూరు నగరంలో మహిళలతో భారీ ప్రదర్శనతో మద్య వ్యతిరేక పోరాటాన్ని చేపట్టనున్నారు. ఈ ఉద్యమ విజయాన్ని ఇప్పుడే ఆకాంక్షించడం కష్టం.



డిఇఓ ఇతర విద్యాశాఖాధికారులతో జడ్పీలోని తన ఛాంబర్‌లో సమీక్షా సమావేశం జరుపుతున్న ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

## ఎస్పీడిసిఎల్ సిఎండిగా వారణాసి కృష్ణమూర్తి

తిరుపతి కేంద్రంగా నడిచే సదరన్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ సిఎండిగా వారణాసి కృష్ణమూర్తిని నియమిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. కృష్ణమూర్తి ఇందుకూరుపేట మండలం కొమరిక వాసి. విద్యుత్ శాఖ ఎఇ స్థాయి నుంచి సిఎండి స్థాయికి ఎదిగారాయన. వివాదరహితునిగా పేరొందిన కృష్ణమూర్తి సంస్థ అభివృద్ధికి ఇతోధికంగా పాటుపడడంతోపాటు వినియోగదారులకు చక్కని సేవలతో మంచి పేరు తెచ్చుకోవాలని మనసారా ఆశిస్తున్నాము.

## చాన్నాళ్లకు రామనారాయణ రాక

రాష్ట్ర మునిసిపల్ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి మూడు నెలల సుదీర్ఘ విరామం తర్వాత జిల్లా పర్యటనకు బయలుదేరి వస్తున్నారు. తుంటి ఎముక నొప్పితో ఇన్నాళ్లు హైదరాబాద్‌లో వుంటూ విశ్రాంతి తీసుకున్నారాయన. ఆగష్టు 15వ తేదీ జాతీయ జెండా ఆవిష్కరణ కార్యక్రమం వుండడంతో తప్పనిసరి పరిస్థితుల్లో 13వ తేదీ నెల్లూరుకు వస్తున్నారు. అగ్రజుడు వివేకానందరెడ్డి నగరంలో ఏర్పాటుచేసే వివిధ కార్యక్రమాల్లో పాల్గొంటారు.

## పట్టుబట్టలు పెట్టి పరవశించిన మేయర్!

నెల్లూరు పర్యటనలో భాగంగా చిరంజీవి తల్పగిరి రంగనాథస్వామి దేవస్థానానికి వెళ్లినప్పుడు అనూహ్యంగా అక్కడ ప్రత్యక్షమైన రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, మేయర్ భానుశ్రీ ఆయన పట్ల అపురూప ఆదరాభిమానాలు చూపారు. మేయర్ భానుశ్రీ చిరంజీవితో మాట్లాడుతూ ఉద్వేగానికి లోనయ్యారు. ఆయనకు ఖరీదైన పట్టు బట్టలు పెడుతూ పరవశించి పోయారు. తాము స్వకులస్తులమని చెప్పి కాంగ్రెస్ పార్టీ నగర అధ్యక్షుడు చాట్ల నరసింహారావు, కార్పొరేటర్ పిండి సురేష్ ఆయన పైనబడి పోవడం చూసిన వారికి ఎబ్బెట్టుగా తోచింది.

## పద్మజకు డాక్టరేట్

ఇందుకూరుపేట జడ్పీ హైస్కూల్‌లో ఇంగ్లీషు బోధించే ఉపాధ్యాయిని జి.పద్మజకు సేలంలోని వినాయక యూనివర్శిటీ డాక్టరేట్ ప్రదానం చేసింది.



'థిమాటిక్ కన్సర్న్స్ ఇన్ సెలక్ట్ నావల్స్ ఆఫ్ ఆర్.కె.నారాయణ్' అనే అంశంపై పరిశోధనకు ఈ డాక్టరేట్ లభించింది. పద్మజను ఎన్‌సిఆర్‌టి సంస్థ తమ టివి ప్రోగ్రామర్‌గా ఎంపిక చేసిందంటే ఈమె ప్రతిభాపాటవాలేమిటో అర్థం చేసుకోవచ్చు.

## అరబ్బుషేక్‌లా చిరంజీవి!

నెల్లూరు పర్యటనకు విచ్చేసిన ప్రజారాజ్యం పార్టీ అధ్యక్షుడు చిరంజీవి 9వ తేదీ సాయంత్రం బారాషహీద్ దర్గాను సందర్శించారు. ఈ సందర్భంగా ఆ పార్టీ మైనార్టీ నాయకులు ఆయనకు అరబ్‌షేక్‌లా బట్టలు తొడిగించారు. వాస్త

కొరవ 14వ పేజీలో

# చిరంజీవిపై తగ్గని అభిమానం!

## చూడను ఎగబడిన యువతులు, గృహిణులు

ప్రజారాజ్యం పార్టీ అధ్యక్షుడు మెగాస్టార్ చిరంజీవికి జనంలో ఏమాత్రం క్రేజ్ తగ్గలేదని 8వ తేది నెల్లూరు నగరంలో ఆయన జరిపిన రోడ్ షోతో మరోసారి వెల్లడయ్యింది. కావలి నుంచి సాయంత్రం ఆరు గంటలకు విఆర్‌సి సెంటర్ వస్తారని ప్రచారం జరిగినా 7.35 ప్రాంతంలో ఆయన అక్కడకు చేరుకున్నారు. ఆయన్ను చూడను యువకులు, గృహిణులు ఎగబడ్డారు. ఇక్కడ నాలుగు నిమిషాలపాటు మాట్లాడిన చిరంజీవి ట్రంకురోడ్డు మీదుగా గాంధీబొమ్మ సెంటర్ చేరుకొన్నారు. ఇక్కడా పెద్ద సంఖ్యలో జనమున్నా ఆయన ముకుళిత హస్తాలతో నమస్కరిస్తూ ముందుకు సాగారే తప్ప మాట్లాడలేదు. ఎసి సెంటర్‌లో ఆయన మాట్లాడాల్సిన పనిలేదని ఆనం కుటుంబ బంటు నగర ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి వారించినా చిరంజీవి ఊరుకోలేదు. మైకందుకని స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డి గుణగణాలను ప్రస్తుతించారు. ప్రక్కనే వున్న ఆయన మనుమడు ఆనం వెంకట రమణారెడ్డికి మంచి రాజకీయ భవిష్యత్తు వుందని చెప్పారు. నర్తకి సెంటర్‌లో అభిమాన జనసందోహాన్ని చూసిన చిరంజీవి నెల్లూరు కార్పొరేషన్‌పై విమర్శల జడివాన కురిపించారు. కార్పొరేటర్లు దోచుకతినవే నెల్లూరు కార్పొరేషన్‌కు వస్తున్న ఆదాయం సరిపోతుంది. అక్కడ జరిగిన అభివృద్ధి శూన్యం. అసెంబ్లీలో మాదిరి నెల్లూరు కార్పొరేషన్ సమావేశాలు గొడవలకు వేదిక అవుతున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు. మంచినీటి సమస్య, డ్రైనేజి, దోమల సమస్యలను పరిష్కరించలేని కార్పొరేషన్ ఎందుకని ఘాటుగా మాట్లాడారు. తన తల్లి అంజనాదేవిది నెల్లూరు అవడం వల్ల తాను నెల్లూరును నేటికీ పురిటిగడ్డగానే భావిస్తానన్నారు.



నెల్లూరు విఆర్‌సి సెంటర్‌లో రోడ్‌షోలో మాట్లాడుతున్న చిరంజీవి.

చిరంజీవి రోడ్‌షో ఆత్మకూరు బస్టాండ్ నుంచి బివిఎస్ గర్ల్స్ హైస్కూల్ వరకు జనసముద్రాన్ని తలపింపజేసింది. ఆదివారం సాయంత్రం కావడం ఆర్యవైశ్యులు ఇళ్ల వద్దే వుండడంతో వారు కుటుంబసమేతంగా చిరంజీవిని చూడను రావడంతో ఆయన ఉద్వేగానికి గురయ్యారు. యువతులు, గృహిణుల సందడి మధ్య చిరంజీవి తానెన్నోసార్లు స్టోన్‌హౌస్‌పేటలో తిరిగి వున్నానని చెప్పుకొచ్చారు. మొత్తం మీద చిరంజీవి రోడ్‌షో అనుకొన్న దానికన్నా బాగా జరగడంతో ప్రజారాజ్యం పార్టీ వర్గాల్లో ఉత్సాహం వెల్లివిరిసింది.

# గోపాలరెడ్డి అవార్డుకు వెంకయ్యనాయుడు అర్హుడు!

నెల్లూరు టౌన్‌హాల్‌లో 8వ తేది సాయంత్రం జరిగిన బెజవాడ గోపాలరెడ్డి స్మారక అవార్డు ప్రదానోత్సవ సభ ఆత్మీయ హృదయావిష్కరణ మధ్య జరిగింది. గోపాలరెడ్డి బతికున్న రోజుల్లో చెప్పిన సమయానికి సభ ప్రారంభమయ్యేలా చేసేవారు. దానికి విరుద్ధంగా అరగంట ఆలస్యంగా మొదలైన సభకు జెవిరెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. పుచ్చలపల్లి సుందరయ్య, బెజవాడ గోపాలరెడ్డి, ముప్పవరపు వెంకయ్యనాయుడు నెల్లూరు నుంచి జాతీయస్థాయికి ఎదిగిన నేతలు. వీరిలో ఎవరి అండాదండా లేకుండానే ఎదిగిన వెంకయ్యనాయుడికి బెజవాడ గోపాలరెడ్డి అవార్డు ఇవ్వడం అత్యంత సమంజసమని కమిటీ అభిప్రాయపడి ఈ ఎంపిక చేసిందన్నారు. రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి బె.గో.రె అందరివాడని అభివర్ణించారు. మాజీ ఎమ్పీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ మాట్లాడుతూ ఎమ్మెల్యే, ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి, గవర్నర్‌గా పనిచేసిన బెజవాడ గోపాలరెడ్డి తాను రాజకీయాల్లో నుంచి రిటైర్ అయ్యాకగాని స్వగృహం నిర్మించుకోలేక పోయారని, ఆయన దర్గామిట్టలో కట్టిన ఇంటికి తానే తొలి గెస్టనని చెప్పారు. అధికార లాలసత్వాన్ని తృణీకరించిన అరుదైన నేత గోపాలరెడ్డి అని స్పష్టం చేశారు. మాజీ గవర్నర్ వి.ఎస్.రమాదేవి మాట్లాడుతూ గోపాలరెడ్డి ఇందిరమ్మను ఒకసారి కలసి వుంటే ఉపరాష్ట్రపతి పదవి దక్కేదని, కానీ ఆయన పోయి కనపడి పదవి తీసుకోవాల్సిన దుస్థితి తనకు లేదని దాన్ని పోగొట్టుకొన్నట్లు చెప్పారు. ఉత్తర ప్రదేశ్ గవర్నర్‌గా ఆయన రాజ్‌భవన్‌లో కూర్చోలేదని రెండుసార్లు రాష్ట్రమంతా తిరిగారని చెప్పారు. వెంకయ్యనాయుడు కూడా మంచి రాజకీయవేత్త దీనికి తోడు మంచి ఉపన్యాసకుడని ఆమె కొనియాడారు. ఎస్పీ దామోదర్ గోపాలరెడ్డితో వెంకయ్యను పోలుస్తూ ఎక్కువసేపు మాట్లాడి మంచి కాకారాయుడనిపించారు.



వెంకయ్యనాయుడికి అవార్డు ప్రదానోత్సవం చేస్తున్న మాజీ గవర్నర్ వి.ఎస్.రమాదేవి, రాజ్యసభ సభ్యుడు యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్. ప్రక్కన వివేకానందరెడ్డి, జె.వి.రెడ్డి, గోవర్ధన్‌రెడ్డి, బి.వి.నరసింహం.

### ప్రదానోత్సవ సభలో వక్తల ప్రశంసల జల్లు

వేద మంత్రాల నడుమ గోపాలరెడ్డి అవార్డును స్వీకరించిన వెంకయ్య నాయుడు ఉద్వేగంగా మాట్లాడారు. ఇప్పటివరకు ఏ అవార్డులు స్వీకరించలేదు. గోపాలరెడ్డి సంస్కారవంతమైన ప్రజాప్రతినిధి కావడం వల్ల ఆయన స్మారక అవార్డు సంతోషంగా స్వీకరిస్తున్నానన్నారు. ఆఖరి రోజు వరకు నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి వుంటానని వెంకయ్యనాయుడు స్పష్టం చేశారు. సభారంభానికి ముందు పద్మాచక్రవర్తి వీణా కచ్చేరి సభికులను అలరించింది.

# ముంగమూరు స్వతంత్రుడు కాడా?

నెల్లూరు నగరంలో ప్రజా సమస్యలు పరిష్కరించకుండా చిత్రవిచిత్ర విన్యాసాలు చేస్తూ జనాభిమానానికి దూరమైనా రూరల్ నియోజకవర్గం నుంచి చావు తప్పి కన్ను లొట్టబోయి గెల్చిన వివేకానందరెడ్డి చేయి పట్టుకొని నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి తిరగడం జనం సహించలేక పోతున్నారు. కానీ శ్రీధర్‌కృష్ణారెడ్డి మాత్రం వివేకానందరెడ్డితో పెట్టుకొంటే తన రాజకీయ భవిష్యత్తు ఛిద్రమౌతుందని భావించి ఆయన్ను గుడ్డిగా అనుసరిస్తున్నారు. నగరంలో వివేకానందరెడ్డిపై వ్యతిరేకత, చిరంజీవి ఛరిస్మా కలగలసి తాను గెలిచానన్న విషయం శ్రీధర్‌కృష్ణారెడ్డి మర్చిపోయారు. శ్రీధర్‌కృష్ణారెడ్డి వ్యవహారశైలి చిరంజీవికి నచ్చడం లేదన్న దానికి 8వ తేది నగరంలో జరిగిన రోడ్ షోలో ఎక్కడా చిరంజీవి తమ పార్టీ ఎమ్మెల్యేను ప్రశంసించలేదు. ప్రజారాజ్యం పార్టీని గెలిపించిన నెల్లూరు నగర ప్రజలకు సదా రుణపడి వుంటానని మాత్రమే చెప్పారు. శ్రీధర్‌కృష్ణారెడ్డికి కొద్దోగొప్పో మంచి పేరుంది. నగరంలో ప్రజారాజ్యం పార్టీకి పైసా డబ్బు తీసుకోకుండా పనిచేసే చిరంజీవి, పవన్‌కళ్యాణ్, అల్లుఅర్జున్ అభిమానులున్నారు. కానీ వీరిపై ఎమ్మెల్యే భరోసా పెట్టడం లేదు. వీరికి వివిధ నామినేటెడ్ పదవుల నియామకంలోనూ శ్రద్ధ తీసుకోవడం లేదు. వివేకా, భానుశ్రీతో కలసి తిరుగుతూ 'తోక ఎమ్మెల్యే'గా మారిపోయారు. ప్రజాచైతన్య యాత్రలో చిరంజీవిపై నగర జనం చూపిన అభిమానంతో అయినా ముంగమూరు కళ్లు తెరచి ఆనం దాస్య శృంఖలాలను తెంపుకొని స్వతంత్రుడు కావాలని ప్రజారాజ్యం పార్టీ క్యాడర్ మనసారా కోరుకొంటుంది. కానీ శ్రీధరన్నలో ఆ ధైర్యం వస్తుందంటారా?



# తెరపై మళ్లీ మెగాస్టార్!

మెగాస్టార్ చిరంజీవిని మళ్లీ వెండితెరపై ఆయన అభిమానులు చూసి పులకించి పోవచ్చు. మంచి కథ దొరికితే మళ్లీ నటిస్తానని చిరంజీవి సూటిగా చెప్పారు. నెల్లూరు పర్యటనలో భాగంగా 9వ తేది ప్రెస్ క్లబ్‌కు వచ్చిన ఆయన మనసువిప్పి మాట్లాడారు. నాలో కళాకారుడు ఇంకా చనిపోలేదు. ఆ బాధతోనే రోబో ఆడియో ఫంక్షన్‌లో కాస్త వ్యథతో మాట్లాడాను. పరిస్థితులన్నీ అనుకూలిస్తే వెండితెరపై త్వరలోనే కనిపిస్తానన్నారు. తాను ప్రజారాజ్యం పార్టీలో హిట్లర్, ఠాగూర్‌నుకానని, అన్ని పార్టీలతో పోల్చితే తమ పార్టీలోనే ప్రజాస్వామ్యం ఎక్కువని చిరంజీవి స్పష్టం చేశారు. తమ పార్టీ బలహీనంగా లేదని పార్టీకి ముందు వెనుకా ప్రజలు అండదండగా వున్నారని చెప్పుకొచ్చారు. అసెంబ్లీ వేదికపై ప్రజా సమస్యల పరిష్కారం కాకపోవడం వల్లే ప్రజల ముందు సమస్యల ప్రస్తావన తెచ్చి పరిష్కరించను తాను ప్రజాచైతన్య యాత్రకు శ్రీకారం చుట్టానన్నారు. కాంగ్రెస్‌కు అవసరమైతే మద్దతు ఇచ్చే విషయంలో వెనకడుగు వేయనని, అయితే తాను వైఎస్ జగన్‌ను విమర్శించలేదన్నారు. ఢిల్లీలో కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీతో కేవలం రాజ్యసభ ఎన్నికల వరకు మాట్లాడానే తప్ప ఇంకేమీ లేదన్నారు. సామాజిక న్యాయానికి పార్టీలో ఎప్పుడూ పెద్దపీట అని అసెంబ్లీ ఎన్నికల్లో కోవూరు నుండి పోటీచేసిన తుపాకుల మునెమ్మ ఎన్నికల తర్వాత పార్టీకి దూరమయ్యింది తప్ప పార్టీ ఆమెను దూరం చేసుకోలేదని ఒక ప్రశ్నకు జవాబుగా చెప్పారు. నెల్లూరుకు వస్తే పాత జ్ఞాపకాలు పురివిప్పుతాయని చిననాటి స్మృతుల్లోకి వెళ్లిపోతానన్నారు. నెల్లూరు ప్రెస్‌క్లబ్ నిర్వహణకు 50వేల రూపాయల విరాళాన్ని ప్రకటించారు చిరంజీవి.




విలేకరుల సమావేశంలో చిరంజీవి.

# ముత్తుకూరు తహశీల్దార్లకు డబ్బే డబ్బు!

**పెద్దసంఖ్యలో పరిశ్రమలు ఏర్పాటవుతున్న ముత్తుకూరు మండలంలో సిజెఎఫ్ఎస్, అసైన్డ్, పట్టా భూములను ప్రభుత్వం సేకరిస్తోంది. ఈ భూములకు ఏదో ఒక రికార్డు లేదంటూ రైతులను తహశీల్దారు, రెవెన్యూ అధికార్లు దబాయించి రెండు చేతులా సంపాదిస్తున్నారు.**

జిల్లాలో పరిశ్రమలు ఏర్పాటైన మండలాల్లో పనిచేసే తహశీల్దార్లు ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు. పరిశ్రమలకు అవసరమైన భూముల్ని సర్వే చేయించడం దగ్గర నుంచి సేకరించిన భూములకు నష్టపరిహారం చెల్లించేవరకు తహశీల్దార్లే కీలకపాత్ర పోషిస్తుంటారు. పరిశ్రమలకు కేటాయించే భూములకు సంబంధించిన అన్ని రికార్డులు కూడా వీరివద్దనే వుంచుకుంటున్నారు. భూములు అనుభవంలో వుండి రికార్డులు లేని రైతులకు తీరని అన్యాయం చేస్తున్నారు.

సిజెఎఫ్ఎస్ అసైన్డ్, పట్టాభూములు పరిశ్రమలకు కేటాయించే వాటిలో వుంటున్నాయి. ఈ భూములకు మార్కెట్ ధర నిర్ణయించి భూమి హక్కుదారులకు పరిహారం చెల్లించాల్సి వుంటుంది. ముత్తుకూరు మండలంలో ఇప్పటికే కృష్ణపట్నం పోర్టు ఏర్పాటుకాగా మరో రెండు థర్మల్ విద్యుత్ స్టేషన్లకు సంబంధించిన నిర్మాణపనులు వేగవంతంగా జరుగుతున్నాయి. ఇక్కడి పరిశ్రమలకు దాదాపు రెండువేల ఎకరాలకు పైగా రైతుల నుంచి భూములు సేకరించి వున్నారు. మరో 15వందల ఎకరాలను సేకరించేందుకు సర్వే పనులు చురుగ్గా కొనసాగుతున్నాయి.

ప్రధానంగా ముత్తుకూరు మండలంలోని శంభునితోపు, నక్కలమిట్ట గ్రామాల్లో సేకరించిన భూములలో కొన్నింటికి సరైన రికార్డులు రైతుల వద్ద లేకుండా పోయాయి. దీంతో భూమికి సంబంధించిన రికార్డులు వుంటేనే నష్టపరిహారం చెల్లిస్తామని లేకుంటే చెల్లించడం కుదరదని మండల తహశీల్దార్ ఉమాదేవి స్పష్టం చేశారు. గతంలో ఇక్కడ తహశీల్దార్‌గా పని చేసి బదలీపై వెళ్లిన శ్రీనివాసమూర్తి హయాంలో నష్టపరిహారం పంపిణీలో భారీస్థాయిలో అవినీతి, అక్రమాలు చోటు చేసుకున్నాయి. అప్పటి నెల్లూరు ఆర్డీఓ వెంకటరమణారెడ్డి తహశీల్దార్‌కు అనుకూలంగా వ్యవహరించారన్న ఆరోపణలు వున్నాయి.

దీంతో అనేక మంది రైతులకు తగిన నష్టపరిహారం అందకుండా పోయింది. ముత్తుకూరు తహశీల్దార్‌గా బాధ్యతలు చేపట్టిన ఉమాదేవికి పరిశ్రమల ఏర్పాటు కోసం తీసుకొన్న భూములకు చెల్లించాల్సిన పరిహారంపై రైతులు మొరపెట్టుకోవడం జరిగింది. భూముల రికార్డులులేని రైతుల జాబితాను తయారు చేయించి పరిహారం అందిస్తామని భరోసా కూడా ఇచ్చారామె. అయితే ఇందుకుగాను లంచాన్ని పారితోషికం రూపంలోఇవ్వమని ముందస్తు ఒప్పందం చేసుకున్నట్లు సమాచారం.

ఎకరాకు ఆరులక్షల నుంచి 9లక్షల వరకు రైతులకు పరిహారం అందించే అవకాశం వుంటుంది. ఇందుకుగాను కొంతమంది రాజకీయ దళారులు రంగప్రవేశం చేసి వున్నారు. కొత్త తహశీల్దార్ వచ్చి తమ




ముత్తుకూరులోని తహశీల్దారు కార్యాలయం. (ఫైల్‌ఫోటో)

సమస్యలను పరిష్కరిస్తారని ఎంతో ఆశతో వున్న రైతులకు తహశీల్దార్ వ్యవహారశైలిని చూసి విస్తుపోతున్నారు. గ్రామ విఆర్వో దగ్గర నుంచి మండల తహశీల్దార్ వరకు భూములకు చెల్లించే పరిహారంలో మామూళ్లు అడుగుతున్నారు. అధికారులు, సిబ్బంది అడిగినంత ఇవ్వకుంటే పరిహారం ఎక్కడ అందకుండా పోతుందోనన్న భయంతో దళారుల ద్వారా అంగీకారం తెలియజేస్తున్నారు.

రైతుల భూములకు సరైన రికార్డులు లేవన్న సాకు చూపి ఇలా దగా చేస్తున్నారు రెవెన్యూ సిబ్బంది. అక్రమ మార్గంలో రైతుల నుంచి సొమ్మును రాబట్టడంలో పురుషులకంటే తానేమి తక్కువ కాదని నిరూపిస్తున్నారు మహిళా తహశీల్దార్. మొత్తం మీద ముత్తుకూరు మండల తహశీల్దార్‌గా ఎవరు వచ్చినా రెండు చేతులా సంపాదిస్తుండడం విశేషం. ◆J

# యాష్‌పాండ్ భూసేకరణలో కుంభకోణం!



యాష్ పాండ్ నిర్మాణానికి సేకరించింది ఈ పచ్చటి పొలాలే.

**ముత్తుకూరు మండలంలో ఏర్పాటు చేసే థర్మల్ విద్యుత్ కేంద్రాల నుంచి వెలువడే బూడిదను నిల్వచేసే యాష్ పాండ్ భూసేకరణలోనూ అవినీతి, అక్రమాలు చోటు చేసుకొన్నాయి.**

జిల్లాలో ముత్తుకూరు మండలంలో ఏర్పాటు కానున్న పరిశ్రమల నుంచి వచ్చే బూడిదను నింపేందుకు సిద్ధం చేసిన యాష్‌పాండ్ భూసేకరణలో అవినీతి, అక్రమాలు చోటు చేసుకున్నాయి. విద్యుత్ ప్రాజెక్టుల నుంచి వెలువడే బూడిదను నింపేందుకు తోటపల్లి గూడూరు మండలంలో దాదాపు వెయ్యి ఎకరాలకు పైగా రెవెన్యూ యంత్రాంగం సేకరించింది. సర్వే దగ్గర నుంచి పరిహారం అందించే వరకు ఆర్థిక లావాదేవీలు జరిగాయి.

ప్రజా ప్రతినిధుల నిర్లక్ష్యం, అధికారుల చేతివాటం కారణంగా రైతులకు తీరని అన్యాయం జరిగింది. టి.పి గూడూరు మండలంలోని చంద్రశేఖర్‌పురం, మండపం గ్రామపంచాయితీలలో రైతుల నుంచి వెయ్యి ఎకరాలను రెవెన్యూ యంత్రాంగం సేకరించింది. వీటిలో ఐదు వందల ఎకరాలు సిజెఎఫ్ఎస్, అసైన్డ్ ప్రభుత్వ భూములున్నాయి. కొంత మంది రైతుల వద్ద హక్కుకు సంబంధించిన పాస్‌బుక్‌లు లేవు. పాస్‌బుక్‌లు లేకుండా పోవడం అధికారులకు బాగా కలసి వచ్చింది.

పాస్‌బుక్‌లు లేని రైతులు దరఖాస్తు చేసుకుంటే, అధికారులకు అందివ్వాలి. అయితే ఇక్కడ గతంలో ప్రభుత్వం పంపిణీ చేసిన భూములకు పరిహారం అందించడంలో అధికారులు మార్గదర్శకాలు పాటించడం లేదు. మరణించిన, వేరే ప్రాంతాల్లో నివాసం వున్న వారి పేర్లతో నకిలీ ధృవీకరణ పత్రాలు తయారు చేసి పరిహారం పొందుతున్నారు. ఇందుకు కొంతమంది రాజకీయ దళారులకు రెవెన్యూ అధికారులు బాగా సహకరిస్తున్నారు.

## అక్రమాల పుట్ట

యాష్‌పాండ్ భూముల సేకరణకు కేంద్రబిందువుగా టి.పి గూడూరు తహశీల్దార్ కార్యాలయం మొదట నుంచి అక్రమాలకు నిలయంగా మారింది. గతంలో ఇక్కడ తహశీల్దార్‌గా పనిచేసి బదలీపై వెళ్లిన సుశీలపై అక్రమాలకు పాల్పడ్డారన్న ఆరోపణలు వున్నాయి. ఎంతటి సమస్యనైనా ముడుపులు ఇస్తే క్షణాల్లో పరిష్కరిస్తారన్న పేరుందామెకు. ఆమె హయాంలోనే యాష్‌పాండ్ భూముల సేకరణ జరిగింది.

భూములకు సంబంధించిన రికార్డుల్ని తారుమారు చేయడం, ఒకరి పేరున వున్న భూమికి మరొకరి పేరుతో పాస్‌బుక్ జారీ చేయడం వంటి చర్యలకు పాల్పడ్డారని ఆందోళనలు కూడా జరిగాయి. నిన్న, మొన్నటి వరకు వేల రూపాయల ధర పలికిన ఈ భూములకు పరిశ్రమల పుణ్యామా అంటూ నేడు లక్షల్లో ధరలు పలకడంతో రాజకీయ దళారులు రంగప్రవేశం చేశారు. రైతుల్ని పలు రకాలుగా ప్రలోభాలకు గురిచేసి సొమ్మును కాజేస్తున్నారు. ఈ సొమ్ములో కొంత భాగం రెవెన్యూ అధికారులకు, సిబ్బందికి ముట్ట చెబుతున్నారు.

మరో ప్రక్క పరిశ్రమల నుంచి వెలువడే బూడిదను భూముల్లో నింపితే సమీపంలో వున్న గ్రామాల ప్రజలు అనారోగ్యం పాలవుతారని, టి.పి గూడూరు మండలంలో బూడిద ప్లాంటును ఏర్పాటు చేయరాదని మండలాధ్యక్షుడు టంగుటూరి శ్రీనివాసులురెడ్డి గత కొన్ని నెలల నుంచి డిమాండ్ చేస్తూ వస్తున్నారు. ఈ విషయంలోనే స్థానిక ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డికి, ఎంపిపికి మధ్య విభేదాలు తలెత్తాయి.

ప్రస్తుతం తహశీల్దార్ లక్ష్మీనారాయణ సైతం భూములకు సంబంధించిన ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. ఒక తహశీల్దార్ హయాంలో భూసేకరణ జరిగితే మరో తహశీల్దార్ హయాంలో పరిహారం అందుతుంది. మండలంలోని ప్రతిపక్ష పార్టీలు తహశీల్దార్ వైఖరిని దుయ్యబడుతున్నాయి. లక్ష్మీనారాయణ బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి ప్రజల గురించి పట్టించుకోవడం లేదన్న విమర్శలు వున్నాయి. ఇటువంటి తహశీల్దార్‌ను గాడిలో పెట్టాల్సిన బాధ్యత ఆర్డీఓ, కలెక్టర్‌పై వుంది. ◆J


నెల్లూరు చిల్డ్రన్స్ పార్కు వద్ద జోకింగ్ క్లబ్ నిర్వహించిన హాస్య ప్రధాన వక్తృత్వ పోటీల్లో విజేత శకుంతమ్మలకు బహుమతినందిస్తున్న కొట్టే రామ్మూర్తి. ప్రక్కన శింగంశెట్టి మురళీమోహన్, పాముల రమణయ్య, మైమ్ రాజేంద్ర తదితరులు.


నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిగిన మేదర సంఘం జిల్లా మహాసభలో కేతా అంకులు చిత్ర పటానికి నివాళులర్పిస్తున్న శనగవరపు శ్రీనివాసులు, రాముడు, అమరావతి కృష్ణారెడ్డి తదితరులు.



నెల్లూరు రోటరీ క్లబ్ నేతృత్వంలో వియానీ హోంలో జరిగిన ఉచిత కంటివైద్య శిబిరంలో పిల్లలను పరీక్షిస్తున్న కంటి డాక్టర్ లక్ష్మీచౌదరి.


నెల్లూరు కార్పొరేషన్‌కు సంబంధించిన రిజర్వు స్థలాలను కాపాడాలంటూ వినూత్నంగా రోడ్లను చిమ్ముతున్న బిజెపి కార్యకర్తలు.

# గుడిపల్లిపాడులో భూ కబ్జా!

## ● సహకారమందించిన అధికార పార్టీ నేతలు

కోటి రూపాయల విలువ చేసే పంచాయితీ భూమిని ఆక్రమించుకోవడమేకాక దానిని అమ్మి సొమ్ము చేసుకొనేందుకు ఆక్రమణదారులు ప్రయత్నిస్తుండడం రూరల్ మండలం గుడిపల్లిపాడులో సంచలనం కల్గించింది. గ్రామంలో సర్వే నెంబర్ 283లో 1.50 ఎకరాల గ్రామనత్తాన్ని కొందరు అధికారపార్టీ నేతల అండదండలతో ఆక్రమించుకొని తమ పొలాల్లో కలుపుకొన్నారు. ఈ భూముల సర్వే నెంబర్లను మార్చేసి రిజిస్ట్రేషన్ కూడా చేయించేసుకొన్నారు. చివరకు అమ్మకానికి సిద్ధమయ్యారు ఈ గుండెలు తీసిన బంట్లు. ఈ భూములను కొనేందుకు ముందుకు వచ్చి కొంత మొత్తం అడ్వాన్సుగా చెల్లించిన వ్యక్తులు భూమి స్థితిగతులను తెలుసుకొనేందుకు రెవెన్యూ కార్యాలయంలో విచారించగా ఆ భూమి గతంలో గ్రామ అవసరాల కోసం, ముఖ్యంగా పోలేరమ్మ గుడి నిర్మాణం కోసం కేటాయించిందని బయటపడడంతో అసలు విషయం బహిర్గతమైంది. ఆలస్యంగా నిద్రమేల్కొన్న అధికారులు ఆక్రమణదారులపై చర్యలు తీసుకోను సిద్ధమయ్యారు.

# ప్రబలుతున్న అతిసార!

**పట్టించుకోని వైద్య ఆరోగ్యశాఖ**

జిల్లాలో అతిసార వ్యాధి ప్రబలుతోంది. పలు గ్రామాలు, పట్టణాల్లో వ్యాధి బారిన పడేవారి సంఖ్య రోజురోజుకు అధికమవుతుండడంతో పలు ప్రభుత్వ, ప్రైవేట్ ఆస్పత్రులు రోగులతో కిటకిటలాడుతున్నాయి. పారిశుధ్యం లోపించడం, త్రాగునీరు కలుషితం అవుతుండడంతో అతిసార విజృంభిస్తోంది. సాధారణ జబ్బులని మొదట నిర్లక్ష్యం చేస్తున్న గ్రామీణ ప్రాంత ప్రజలు పరిస్థితి విషమించిన తర్వాత ఆస్పత్రులకు పరుగులు పెడుతున్నారు. నెల్లూరు, కావలి, బుచ్చి, అల్లూరు, ఉదయగిరి, గూడూరు, వెంకటగిరి, పొదలకూరు, ఆత్మకూరు, నాయుడుపేట, సూళ్లూరుపేట తదితర ప్రాంతాలలో ఈ వ్యాధి తీవ్రంగా ప్రబలుతోంది. జిల్లావ్యాప్తంగా వివిధ ఆస్పత్రుల్లో వందలమంది చికిత్స పొందుతున్నట్లు సమాచారం. అధికారులు కేసులు స్వల్పంగానే అని చెప్తున్నా వాస్తవంగా అతిసార తీవ్రత, రోగుల సంఖ్య అధికంగానే వుంది. ఇప్పటికైనా అధికారులు ఈ వ్యాధి ప్రబలకుండా చర్యలు తీసుకోవడంతోపాటు తగిన పారిశుధ్య చర్యలు చేపట్టాల్సిన అవసరం వుంది.

# వెంకటగిరిలో వృత్తి విద్యా కళాశాల!

వెంకటగిరి పట్టణంలో వృత్తి విద్యా కళాశాల ఏర్పాటైంది. రిటైర్డ్ డిఐజి నాగముని నాయక్ ఈ గౌతమ్ వృత్తి విద్యాకళాశాలను నెలకొల్పారు. కళాశాల ప్రారంభోత్సవానికి విచ్చేసిన మునిసిపల్ ఛైర్మన్ అల్లం చంద్రమోహన్ మాట్లాడుతూ సమీపప్రాంతంలో భెల్ పరిశ్రమ ఏర్పాటవుతున్న తరుణంలో నాయక్ ఈ విద్యాసంస్థను నెలకొల్పడం అభినందనీయమన్నారు. నర్సింగ్, వైరింగ్, ల్యాబ్ టెక్నాలజి తదితర కోర్సులను ప్రవేశపెడుతున్నట్లు నిర్వాహకులు తెలిపారు. ఎస్సీ, ఎస్టీ విద్యార్థులకు ఫీజు రీఎంబర్స్‌మెంట్ సౌకర్యం వున్న దృష్ట్యా ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలని కోరారు. ఈ కార్యక్రమంలో డాక్టర్ శేషమనాయుడు తదితరులు పాల్గొన్నారు.

# అక్రమాల చిట్టా విప్పిన మండలాధ్యక్షుడు!

## ● రాపూరులో ఉపాధిహామీ నిధులు దుర్వినియోగం

రాపూరు మండలంలో ఉపాధిహామీ పథకం నిధుల్లో జరుగుతున్న అవకతవకలపై అధికారపార్టీకి చెందిన మండలాధ్యక్షుడు చిట్టా విప్పడం కలకలం రేగింది. పనుల కోసం ఊరు వదలి వలస వెళ్లిన మద్దూరుపల్లి గ్రామం, కలుజుగుంట గ్రామాల్లో ఉపాధిహామీ పనుల్లో జరిగిన అక్రమాలను సాక్ష్యాలతో సహా రుజువు చేసేందుకు ఎంపిపి సూర్యప్రకాష్‌యాదవ్ మీడియా ప్రతినిధులను తీసుకెళ్లాడు. అక్కడ పాఠశాల లెవలింగ్ పనులు చేసి ఎంపిడిఓ, ఎపిఓ, కార్యదర్శులు నిధులు స్వాహా చేశారని మండలాధ్యక్షుడు తీవ్ర ఆరోపణలు చేశాడు. మండలంలో ఉపాధిహామీ పనుల్లో పలు అక్రమాలు భారీగా జరిగాయని ఆరోపించారు. సాధారణంగా ప్రతిపక్ష పార్టీలు ఇలాంటి అక్రమాలపై స్పందిస్తుంటాయి. రాపూరులో అధికారపార్టీకి చెందిన ఎంపిపి అక్రమాలను బట్టబయలు చేయడంతో ఇందులో భాగస్వాములైన అధికారులు హడలిపోతున్నారు. పనులు సక్రమంగా జరిగాయని కలెక్టర్‌కు నివేదికలు ఇచ్చిన అధికారులకు సైతం ముచ్చెమటలు పోస్తున్నాయి మండలాధ్యక్షుడి ప్రకటనతో. మొత్తం మీద అధికారపార్టీకి చెందిన ఆయన ఆరోపణలతో సంచలనం కల్గింది.

# రెవెన్యూ సిబ్బంది కొరత

**ఆత్మకూరు ఎమ్మార్వో ఆఫీసులో పరిస్థితిది!**

కీలకమైన ప్రభుత్వ శాఖల్లో రెవెన్యూశాఖ ఒకటి. నిత్యం ప్రజలు ఈశాఖ కార్యాలయాలకు వివిధ పనులపై వస్తుంటారు. అంతటి ప్రాధాన్యత గల శాఖలో సిబ్బంది కొరత పట్టి పీడిస్తుంది. తగినంత సిబ్బందిలేని కారణంగా పనులకు ఆటంకం కల్గుతోంది. జిల్లావ్యాప్తంగా 18 తహశీల్దార్ పోస్టులు, 78 సీనియర్ అసిస్టెంట్ పోస్టులు ఖాళీగా వున్నాయి. ఆత్మకూరులో డిప్యూటి తహశీల్దార్, జూనియర్ అసిస్టెంటు, ఆర్‌ఐ పోస్టులు ఖాళీగా వుండడంతో తహశీల్దార్ శ్రీనివాసమూర్తి ఒక్కడే అన్నీ పనులు చూసుకోవాల్సి రావడంతో ఎక్కడి పనులు అక్కడ నిలచి పోతున్నాయి. స్థానికంగా తహశీల్దార్‌కు మంచి పేరున్నప్పటికీ సిబ్బంది కొరత కారణంగా ప్రజలకు తిప్పలు తప్పడం లేదు. జిల్లాలో నిత్యం ప్రజల రాకపోకలతో నెల్లూరు తరువాత రద్దీగా వుండేది ఆత్మకూరు తహశీల్దార్ కార్యాలయం. సిబ్బంది కొరతకు తోడు నిధులు కొరత మూలిగే నక్కపై తాటిపండు పడినట్లుగా వుంది. అధికారులు ప్రజల అవసరాలను గుర్తించి రెవెన్యూ కార్యాలయాల్లో సిబ్బంది ఖాళీలను భర్తీ చేయాల్సి వుంది.

# సీనియర్ న్యాయవాదికి సన్మానం!

## సుబ్బరామరెడ్డి గుణగణాలను ప్రస్తుతించిన ప్రముఖులు




గూడూరులో సీనియర్ న్యాయవాది వాకాటి సుబ్బరామరెడ్డి సన్మాన దృశ్యం.

గూడూరులో పేరొందిన న్యాయవాది, పలు న్యాయ పదవులను చేపట్టి మంచి పేరు ప్రఖ్యాతులు గడించిన వాకాటి సుబ్బరామరెడ్డి న్యాయవాదిగా 50ఏళ్లు పూర్తి చేసుకొన్న సందర్భంగా ఘనసన్మానం జరిగింది. గూడూరు బార్ అసోసియేషన్, సుబ్బరామిరెడ్డి వద్ద న్యాయవాదులుగా పని చేసిన వారు కలసి స్థానిక కోర్టు ఆవరణలో సన్మాన కార్యక్రమం జరిపారు. జిల్లాసెషన్స్ జడ్జి రెడ్డప్పరెడ్డి, హైకోర్టు రిటైర్డ్ జడ్జి ఆర్.బయ్యప్పరెడ్డిలు ముఖ్య అతిథులుగా హాజరై సుబ్బరామరెడ్డి ప్రతిభను, 50ఏళ్లుగా న్యాయవాదిగా ఆయన దక్కించుకొన్న విజయాలను ప్రశంసించారు. బార్ అసోసియేషన్ అధ్యక్షుడు హరి ప్రసాద్ మాట్లాడుతూ ఎజిపిగా, ఎండోమెంట్ అడ్వొకేట్‌గా, మునిసిపల్ అడ్వొకేట్‌గా పని చేసిన సుబ్బరామరెడ్డి పనితనాన్ని అభినందించారు. అమూల్యమైన లా పుస్తకాలను బార్ అసోసియేషన్‌కు ఇచ్చిన దాతృత్వాన్ని ప్రశంసించారు.

సన్మాన గ్రహీత సుబ్బరామరెడ్డి తనకు జరిగిన అభినందన సత్కారానికి వినమ్రంగా కృతజ్ఞతలు తెలిపారు. తనకు న్యాయవాద వృత్తిలో తోడ్పడిన ఆచార్య పిసిరెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులరెడ్డి తదితరులను గుర్తు చేసుకొన్నారు. ఈ కార్యక్రమానికి పలువురు న్యాయవాదులు, న్యాయమూర్తులు హాజరయ్యారు.

# రగడ.... రగడ!

## వెంకటగిరి మునిసిపల్ మీట్ జరిగిన తీరిది.

ప్రజాసమస్యల పరిష్కారంలో పాలకులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారంటూ కౌన్సిలర్లు నిరసన తెలపడంతో వెంకటగిరి మునిసిపల్ సమావేశం రసాభాసగా మారింది. పట్టణంలో సమస్యలు పరిష్కారం కావడంలేదంటూ పార్టీలకు అతీతంగా నిరసనకు దిగడంతో ఛైర్మన్ అల్లం చంద్రమోహన్ సైతం వారితో గొంతుకలిపారు. ధర్నాలకు నేను వస్తా అవసరమైతే మూకుమ్మడి రాజీనామాలు చేద్దామంటూ వ్యాఖ్యానించారు. సభ ప్రారంభం కాగానే అధికార కాంగ్రెస్ పార్టీ సభ్యులు నక్కా వెంకటేశ్వరరావు, చిట్టేటి హరికృష్ణలు మాట్లాడుతూ పాలకవర్గం ఏర్పడి ఐదేళ్లు గడుస్తున్నా ప్రజాసమస్యలు పరిష్కారం కావడం లేదని కౌన్సిల్ నుంచి ఎలాంటి సమాధానం రాబట్టలేకపోయామని ఆవేదన చెందారు. టిడిపి సభ్యుడు జానకిరామయ్య ఇందిరమ్మ ఎంపికలకు సంబంధించి అవకతవకలపై నిరసనకు దిగాడు. రేషన్ కార్డుల తొలగింపులో అర్హులకు అన్యాయం జరిగినప్పటికీ అధికారులు పట్టించుకోవడం లేదన్నారు. బిల్ కలెక్టర్ రాజా 15లక్షలు స్వాహా విషయమై రగడం రేగింది. దీనికి ఛైర్మన్ జోక్యం చేసుకొని సభ్యుల ఆవేదనను అర్థం చేసుకొన్నానని నేనూ మీతో కలసి ఆందోళన చేయడానికి సిద్ధం అని హామీ ఇవ్వడంతో సభ్యులు శాంతించారు.

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు

# బిట్రగుంటలో చిల్లర దొంగతనాలు!

బిట్రగుంటలో చిల్లర దొంగతనాలు జోరందుకొన్నాయి. స్థానికంగా వ్యాపారం నిర్వహించే పలు దుకాణాలలో దొంగలు చొరబడి చేతికందిన వస్తువులను తస్కరించేస్తున్నారు. సిడిషాపు, చిల్లర అంగడి, ఫ్యాన్సీ షాపుల్లో వరుసగా దొంగతనాలు జరిగాయి. సిడిలు, బియ్యం బస్తాలు, ఫ్యాన్సీ వస్తువులు పెద్ద ఎత్తున దొంగతనానికి గురి కావడంతో వ్యాపారులు హడలి పోతున్నారు. దీనికితోడు మద్యం

### పట్టించుకోని పోలీసు!

సేవించేవారి ఆగడాలు పెరిగిపోయాయి. చిన్నచిన్న వివాదాల్లో తలదూర్చేవారు సైతం మద్యం కోసం బెదిరింపులకు దిగుతుండడంతో వ్యాపారులు ఆందోళన చెందుతున్నారు. వరుస దొంగతనాలు, రౌడీయిజంపై స్థానిక పోలీసులకు ఫిర్యాదు చేసినా పట్టించుకోనేవారే లేకుండా పోయారని వ్యాపారులు వాపోతున్నారు.

## 'ఆది' కేశవులు రుసరుస



తిరుమల తిరుపతి దేవస్థానం ఛైర్మన్ ఆదికేశవులు నాయుడు రోశయ్యపై రుసరుసలాడుతున్నాడు. ఛైర్మన్‌గా కాలపరిమితి ముగియనుండటంతో తనకు మరోసారి అవకాశం ఇవ్వాలని ఆయన కోరుతున్నాడు. అయితే ఇటీవల కాలంలో టిటిడి పై వచ్చిన విమర్శల్ని దృష్టిలో పెట్టుకొని ఆదికేశవుల్ని సాగనంపాలని రోశయ్య ఇప్పటికే నిర్ణయించాడు. కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వానికి ముప్పు ఏర్పడినపుడు అప్పట్లో తెలుగుదేశంలో వున్న ఆదికేశవులు పార్టీ ఫిరాయించి కాంగ్రెస్‌కు ఓటేశాడు. ఆ కృతజ్ఞత కారణంగానే అధిష్టానం సిఫార్సుతో టిటిడి ఛైర్మన్ అయ్యాడు. అయితే ప్రస్తుతం సీన్ మారింది. రోశయ్య తన సామాజిక వర్గానికి చెందిన జిఎంఆర్ అధినేతకు పట్టంకట్టాలని యోచిస్తున్నాడు. దీంతో 'ఆది' పరిస్థితి అయోమయంగా తయారైంది.

## 'చిరు'కు తొందరెక్కువ



ప్రజారాజ్యం అధ్యక్షుడు చిరంజీవి తన తొందరపాటుతో సొంతపార్టీలోనే విమర్శల్ని ఎదుర్కొంటున్నాడు. ప్రజా చైతన్య పర్యటనల సందర్భంగా 'చిరు' చేస్తున్న వ్యాఖ్యలు అసలుకే ఎసరు తెస్తున్నాయంటూ 'చిరు' తమ్ముళ్లు మొత్తుకుంటున్నారు. కాంగ్రెస్ పార్టీకి మెజారిటీ తగ్గితే మేం ఆదుకుంటామంటూ 'చిరు' ప్రకటించాడు. దీనివల్ల భవిష్యత్‌లో కాంగ్రెస్‌తో 'బేర సారాల'కు ఇబ్బంది ఎదురవుతుందని ఆ పార్టీ సీనియర్లు అంటున్నారు. జగన్ వల్ల కాంగ్రెస్ మైనారిటీలో పడితే తమ అవసరం తప్పనిసరి అని అటువంటప్పుడు కేబినెట్‌లో సాధ్యమైనన్ని పదవుల్ని డిమాండ్ చేసే అవకాశం దీనివల్ల దెబ్బ తింటుందన్నది వారి వాదన. వింటున్నారా! 'చిరు' పెదవి దాటితే ఎన్ని ఇబ్బందులో...!

## రోశయ్య ద్విపాత్రాభినయం



ముఖ్యమంత్రి రోశయ్య ద్విపాత్రాభినయంపై ప్రస్తుతం రాజధాని రాజకీయవర్గాల్లో రసవత్తర చర్చ జరుగుతోంది. ఒక పక్క కెవిపి రామచంద్రరావుతో దోస్తీ చేస్తూ మరో పక్క జగన్ వర్గీయులపై కత్తి దూస్తున్నాడు రోశయ్య. దీంతో వైఎస్ వ్యతిరేక వర్గీయులు ఇబ్బందికర పరిస్థితిని ఎదుర్కోవాల్సి వస్తూంది. వైఎస్ సిఎంగా వున్నప్పటి మాదిరిగానే రోశయ్య కాలంలో కూడా కెవిపి చక్రం తిప్పుతున్నాడు. ప్రభుత్వ ముఖ్య నిర్ణయాల్ని ఆయనే ప్రభావితం చేస్తున్నాడు. ఐఎఎస్ బదలీల దగ్గర నుంచి తానే దగ్గరుండి చూస్తున్నాడు. ఈ పరిస్థితి వైఎస్ వ్యతిరేకులకు నచ్చడం లేదు. అయితే అధిష్టానం ఆదేశానుసారమే కెవిపిని చేరదీయాల్సి వస్తోందని రోశయ్య చెబుతున్నాడు. అయినా దీని వెనుక 'మర్మం' అర్థమై వైఎస్ వ్యతిరేకులు తల పట్టుకుంటున్నారు.

## ఉచిత రుణాలకు 'మార్కెటింగ్'



మీకు వడ్డీ లేకుండా రుణాలు కావాలా? అయితే అర్జెంటుగా వ్యవసాయ మార్కెట్‌శాఖకు వెళ్లండి. అక్కడ వడ్డీ లేకుండా రుణాలు ఇవ్వడానికి తెరలేపారు. రాష్ట్రంలో పత్తిజిన్నింగ్, ప్రెస్సింగ్ మిల్లులు ఏర్పాటు కోసం మార్కెట్ కమిటీల నిధుల నుంచి 50శాతం సాఫ్ట్ రుణం ఇస్తారట. అర్హతలతో పని లేకుండానే ఈ రుణాలు అప్పనంగా ఇస్తారు. కాకపోతే 'కాస్తంత' ఖర్చవుతుంది.

నిజానికి మార్కెట్ కమిటీ నిధుల్ని రైతుల సంక్షేమం కోసం మాత్రమే వాడాలి. ఇలా పారిశ్రామిక వేత్తలకు 'రుణ' రూపంలో ధారపోయడానికి చట్టంలో ఎక్కడా ప్రొవిజన్ లేదు. అయినా అవినీతి సామ్రాట్టుగా మారిన ఆ శాఖ కమిషనరు తన ఇష్టం వచ్చినట్లుగా వ్యవహరిస్తూ 'సొమ్ము' చేసుకునే ప్రయత్నంలో ఉన్నాడు. పాపం! రైతుల సొమ్ము పారిశ్రామికవేత్తల పాలు కాబోతోందన్నమాట!ప్చ్!

## బిపి ఆచార్య నమః



రాష్ట్ర రాజకీయం రసకందాయంలో పడుతోంది. దీంట్లో భాగంగానే రాష్ట్ర పారిశ్రామిక మౌళిక వసతుల కల్పన సంస్థ కేంద్ర బిందువుగా మారింది. వై.ఎస్ సిఎంగా వున్నప్పుడు ఈ సంస్థకు అంబటి రాంబాబు ఛైర్మన్‌గా, బి.పి.ఆచార్య ఎండీగా వున్నారు. మూడేళ్ల కాలంలో ఈ సంస్థ ద్వారా వేలాదికోట్ల రూపాయలు విలువ చేసే ప్రభుత్వ భూముల్ని 'అస్మదీయులకు' అప్పనంగా ధారాదత్తం చేశారు. దీంట్లో డబ్బు పెద్ద మొత్తంలో చేతులు మారాయి కూడా. ప్రస్తుతం సీను మారింది. అంబటి రాంబాబుపై కాంగ్రెస్ కదంతొక్కుతోంది. అప్పట్లో జరిగిన కుంభకోణాల్ని వెలికి తీసి వై.ఎస్ వర్గీయుల్ని దెబ్బ తీయటానికి పావులు కదుపుతున్నారు. ఇదంతా గమనించిన సలహాదారు కెవిపి రామచంద్రరావు ఆగమేఘాలమీద బి.పి ఆచార్యను పారిశ్రామికశాఖ ముఖ్యకార్యదర్శిగా బదిలీ చేయించాడు. పదవి రీత్యా ఆయన పై సంస్థలో సభ్యుడుగా కూడా వుండొచ్చు. అయితే బి.పి ఆచార్యకు అక్కడ చుక్కెదురైంది. ఆ సంస్థ ద్వారా ఎమ్మార్ ప్రాపర్టీస్‌కు దఖలు చేసిన భూములపై దర్యాప్తు చేయాలని సంస్థ పాలకవర్గం నిర్ణయించింది. కాంగ్రెస్ 'సీమ' నాయకులు డిఎస్.రవీంద్రారెడ్డి, దివాకర్ రెడ్డి కూడా దీనిపై ఎత్తుకొని వున్నారు. దీంతో బి.పి ఆచార్య కుడితిలో పడ్డ ఎలుకలా గిలగిల కొట్టుకుంటున్నాడు. కె.వి.పి అండదండలతో జరిగిన కుంభకోణాలకు ఆచార్య కేంద్ర బిందువుగా వ్యవహరించడంతో ఆయన మెడకు ఇప్పుడు కత్తి వేలాడుతోంది. కె.వి.పి ఏం చేస్తాడో అని ఎదురు చూడటం ఆచార్య వంతు అయింది.



పెన్నా బ్యారేజ్ నిర్మాణ పనులను తక్షణం ప్రారంభించాలని నెల్లూరు వారధిపై ధర్నా చేస్తూ మాట్లాడుతున్న ప్రజారాజ్యం పార్టీ అధినేత చిరంజీవి.



నెల్లూరు బారాషహీద్ దర్గాలో చాదర్ సమర్పిస్తున్న ప్రజారాజ్యం పార్టీ అధినేత చిరంజీవి.




## అక్కడ బసచేస్తే అంతేనా?

నెల్లూరు బారాషాహీద్ దర్గాకు సమీపంలో చెరువును ఆనుకొని బ్రహ్మాండమైన గెస్ట్‌హౌస్‌ను జిల్లా కలెక్టర్ రాంగోపాల్ నిర్మింపజేశారు. దీనికిగాను కృష్ణపట్నం పోర్టు కంపెనీ సహకారం తీసుకొన్నారు. ముఖ్యమంత్రి హోదాలో రాజశేఖర్‌రెడ్డి వస్తే ఏ ఇబ్బందులు లేకుండా బసచేయను ఈ గెస్ట్‌హౌస్‌ను డిజైన్ చేశారు. ఆయన చేత ప్రారంభింపజేయాలని నిర్మాణం పూర్తిచేసి చాలా రోజులు వేచి చూశారు. కానీ వైఎస్ ఇక్కడ బసచేయకనే కాలధర్మం చెందారు. ఆతర్వాత గెస్ట్‌హౌస్‌ను ప్రారంభించిన మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి తుంటి ఎముక నొప్పిరాగా, ఒక నిద్రచేసిన ముఖ్యమంత్రి రోశయ్య రాజకీయంగా చాలా కష్టాల్లో పడ్డాడు. 8వ తేది ఆదివారం ఇప్పటికే కష్టాల్లో వున్న మెగాస్టార్ ఈ గెస్ట్‌హౌస్‌లో బసచేశారు. ఆయన భవిష్యత్తు ఎలా వుంటుందనేది కాసిన్ని రోజులు ఆగి చెప్పాల్సిందే.

## దొంగల సవాల్




నెల్లూరు నగర పోలీసులకు రోజుకో దొంగతనం చేసి దొంగలు సవాల్ విసురుతున్నారు. గడచిన వారంలో వరుసగా ఐదు భారీ దొంగతనాలు జరిగాయి. ఇందులో ఓ కానిస్టేబుల్ ఇల్లు వుండడం విశేషం. ఎస్పీగారు తరచూ సమీక్షా సమావేశం పెడుతున్నా ఎందువల్లో నగర పోలీసుల్లో జోష్ రావడం లేదు. ఇది చూసి దొంగలు సవాల్ చేస్తున్నారు. దొంగతనాలు తెగచేస్తూ రెచ్చి పోతున్నారు.



## వెనుకబడ్డ జిప ఛైర్మన్

అందరి మనసులు దోచేలా పనిచేస్తున్న జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఓ విషయంలో మాత్రం వెనుకబడ్డారు. నెల్లూరు నగర నడిబొడ్డులో వున్న జిల్లా పరిషత్ కార్యాలయాన్ని ఆధునిక హంగులతో కొత్తగా తీర్చిదిద్దాలని క్షయాసుపత్రి ప్రాంగణంలో ఏడాది క్రితం శంకుస్థాపన చేయించారు. నాలుగు కోట్ల రూపాయలు వెచ్చించి నిర్మిస్తున్న ఈ భవన నిర్మాణం నిదానంగా కొనసాగుతుండగా ఆతర్వాత ఈ ప్రాంగణంలోనే పనులు ప్రారంభించబడ్డ కార్పొరేషన్ ఆఫీసును మాత్రం మేయర్ భానుశ్రీ గారు యుద్ధప్రాతిపదికన నిర్మింపజేస్తున్నారు. ప్రారంభోత్సవానికి తేదీలు ప్రకటించారు. పొదలకూరురోడ్డును ఆనుకొని ముందు పూర్తికాని జడ్పీ ఆఫీసు, వెనుక పూర్తవుతున్న కార్పొరేషన్ కార్యాలయాలు చూపరులను ఆకర్షిస్తున్నాయి.

## చిరంజీవి ఫ్లెక్స్‌లు అదరహో...!



నెల్లూరు నేతలు కళాపోషకులు. నగరానికి ముఖ్యులైన నేతలు వచ్చే సమయంలో, ముఖ్య పదవుల్లో నియమింపబడిన సమయంలో కొత్తగా వచ్చిన ఫ్లెక్స్‌బోర్డులతో హంగామా చేసి పారేస్తున్నారు. ఆ మధ్య నగరానికి రోశయ్య ముఖ్యమంత్రి హోదాలో తొలిసారిగా వచ్చినపుడు పెట్టిన ఫ్లెక్స్‌ను చూసి ఆయన నోరెళ్ల బెట్టాడు. రాష్ట్రంలో ఎక్కడా తనకు ఇటువంటి స్వాగతం లభించలేదని తనకు ఎంతో ముఖ్యులైన ఆర్యవైశ్య నేతల ముందు వ్యాఖ్యానించారాయన. ఈ మధ్య స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని వివేకానందరెడ్డి నగరంలో పెట్టించిన బ్లాక్ అండ్ వైట్ ఫ్లెక్స్ బోర్డులు అలరించాయి. వీటిని మరచిపోక ముందే మెగాస్టార్ చిరంజీవి రాకను పురస్కరించుకొని ప్రజారాజ్యం పార్టీ నగర అధ్యక్షుడు ముక్కాల ద్వారకనాథ్ తదితరులు చిరంజీవి వైరటీ గెటప్పులతో పెట్టిన ఫ్లెక్స్‌లు ఆయన అభిమానులతోపాటు అందరినీ అలరిస్తున్నాయి.



## ఏడుకోట్లతో అలకవీడాడు!

ఆనం సోదరుల్లో మూడవవాడైన జయకుమార్‌రెడ్డి ఎట్టకేలకు అలకవీడి కార్పొరేషన్ కార్యాలయంలో కాలుపెట్టాడు. తన మాటకన్నా అగ్రజుడు వివేకా భానుశ్రీ మాటకు మునిసిపల్ పాలనలో విలువిస్తుండడంతో జయకుమార్‌రెడ్డి కొన్నాళ్లు బెంగుళూరు, హైదరాబాద్‌లలో గడిపాడు. జయకుమార్‌రెడ్డికి బినామీ పేర్లతో మునిసిపాలిటీలో కాంట్రాక్ట్ పనులు చేయడం అలవాటు. సోదరుని అలకతీర్చను ఎంతో వివాదాస్పదమైన బాగున్న చిల్డ్రన్స్ పార్కు రోడ్డుపై మళ్లీ రోడ్డువేసే కాంట్రాక్టును వివేకానందరెడ్డి ఆయనకు దఖలు పర్చాడు. ఈ పని విలువ ఏడు కోట్ల రూపాయలు. ఇది తన బినామీకి దక్కిన తర్వాత మూడవ సోదరుడు అలకవీడి నెల్లూరు నగర ప్రవేశం చేయడం ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

# వరలక్ష్మీ వ్రతంతో సకల సౌభాగ్యాలు!



భారతీయ సంస్కృతి సాంప్రదాయాల్లో వ్రతాలు, నోములకు ఎంతో ప్రాధాన్యత వుంది. కుటుంబ క్షేమంతోపాటు సమాజ క్షేమాన్ని కోరుకోవడం వీటిలో కన్పడుతుంది. శ్రావణమాసంలో వరలక్ష్మీవ్రతం, గౌరీవ్రతాలు ఆచరిస్తారు. శ్రీమన్నారాయణుడు శ్రవణానక్షత్రంలో జన్మించినందున శ్రావణమాసానికి అంతటి విశిష్టత వుంది. వైయుక్తిక, కుటుంబ, ఆధ్యాత్మిక సంస్కృతులను ఈ నోములు వికసింపజేస్తాయి. శ్రావణమాసంలో రెండవ శుక్రవారం, పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు వరలక్ష్మీ వ్రతం చేస్తారు. ఆగస్టు నెలలో 20తేదీ నాడు ఈ వ్రతాన్ని జరుపుకొంటారు.

ఈ వరలక్ష్మీవ్రత విశిష్టతను తెలియజెప్పడంలో ఒక పురాణ కథనం వుంది. పార్వతిదేవి ఒకనాడు శివుడిని లోకంలో స్త్రీలు సకల సౌభాగ్యాలు, అష్టైశ్వర్యాలు, పుత్రపౌత్రాదులను పొందేందుకు వీలుగా వుండే వ్రతాన్ని చెప్పమని కోరగా శంకరుడు వరలక్ష్మీ వ్రతాన్ని సూచించినట్లు పురాణాలు చెప్తున్నాయి. స్కంద పురాణంలో పరమశివుడు వ్రతం యొక్క విశిష్టతను పార్వతికి వివరించినట్లు వుంది.

మగధదేశం కుండి నగరంలో చారుమతి అనే సాధ్వి, సద్గుణశీలవతి నివసిస్తుండేది. ఆమె, భర్త అత్తమామల పట్ల గౌరవంతో మెలగుతూ సేవలు చేస్తుండేది. ఒకనాడు ఆమెకు కలలో మహాలక్ష్మి సాక్షాత్కారమిచ్చి, నన్ను ఆరాధించి, నా వ్రతాన్ని ఆచరించినట్లయితే అనుగ్రహం లభించి కోర్కెలు తీరుతాయని ఆశీర్వదించి జగన్మాత అంతర్ధానమైంది. తనకు స్వప్నంలో కన్పించి చెప్పిన విధంగా శ్రావణ మాసంలో శుక్రవారం నాడు నియమనిష్టలతో వరలక్ష్మీ వ్రతాన్ని పాటించి ఆ దేవి అనుగ్రహం పొందింది చారుమతి అంటూ శివుడు వివరించగా గిరితనయ అలాగే శాస్త్రయుక్తంగా వ్రతం ఆచరించినట్లు పురాణ కథనం.

అష్టలక్ష్మల్లో వరలక్ష్మికి ఒక ప్రత్యేకత వుంది. శ్రీహరి జన్మనక్షత్రమైన శ్రావణమాసంలో వరలక్ష్మీ వ్రతాన్ని భక్తిశ్రద్ధలతో, నియమనిష్టలతో చేయడం వలన సకల సౌభాగ్యాలు, అష్టైశ్వర్యాలు సిద్ధిస్తాయని నమ్మకం. ఆరోజున పొద్దుటే స్నానమాచరించి పూజామందిరాన్ని శుభ్రంగా వుంచుకొని పూజామంటపం వద్ద అష్టదళ పద్మ ముగ్గులు వేయాలి. పాలవెల్లిని మామిడి, మర్రి, రావి, జువ్వి, ఉత్తరేణి పత్రాలతో అలంకరించి, క్రొత్తబియ్యం పోసి దానిపై కలశం పెట్టాలి. అందులో టెంకాయ వుంచి పసుపుతో బొమ్మను చేసి, ముందుగా గణపతి పూజ చేసి అనంతరం లక్ష్మీదేవిని పూజించాలి. లక్ష్మీదేవిని ఆవాహన చేసి షోడషోపచార పూజలు, అధంగపూజ చేసి అష్టోత్తర శతనామావళి పఠించాలి. ధూప, దీప నైవేద్యాలు సమర్పించి మంగళహారతి నిచ్చి నైవేద్యం పెట్టాలి. ఈ సందర్భంగా తొమ్మిది దారపు పోగులతో తోరబంధనపు మంత్రం పఠిస్తూ ఆ తోరమును కుడిచేతికి కట్టుకోవాలి.

*నమోస్తేస్తు మహామాయే శ్రీ పీఠేసుర పూజితే*
*శంఖ చక్ర గదాహస్తే మహాలక్ష్మీ నమోస్తుతే...*

అంటూ పూజించి వ్రతాన్ని ఆచరించడం సర్వ శుభకరం.

# వారఫలాలు

*తేది 14-08-2010 నుండి 20-08-2010 వరకు కర్కాటక, సింహాల్లో రవి; సింహంలో బుధుడు; మీనంలో గురువు; కన్యలో శని, శుక్రుడు, కుజుడు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సుల్లో చంద్రుడు సంచరిస్తారు.*




సంతాన మూలంగా స్త్రీమూలంగా ధనప్రాప్తి. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. వారాంతంలో అధిక ఖర్చులు. పురోభివృద్ధి అన్ని రంగాలలో ఉంటుంది. రాజకీయులకు అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాల నార్జిస్తారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు. ఓర్పు అవసరం. గౌరవమర్యాదలకు లోటు రావచ్చు.




మోసానికి గురి అవుతారు. ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. అప్పుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. సోదరులతోటి సమస్యలు ఒక కొలిక్కి రావచ్చు. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి.




ఆహారవిషయంలో జాగ్రత్త. పనుల్లో ఆటంకాలు అధికం. ధనాదాయం బాగుంటుంది. శత్రువులు లొంగి నడచుకొంటారు. అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలోజరుపుకొన్నా శ్రమ, అలసట అధికం. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం గాదు. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త. మనసు పరిపరి విధాల పయనిస్తుంది. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం.




ప్రయాణాలు ఊహించని రీతిలో ఉంటాయి. కొంత ప్రయత్నం తర్వాతనే పనులు సాగుతాయి. ఆరోగ్యం సక్రమంగా ఉండదు. వాత సంబంధిత బాధలుంటాయి. బయటవారికోసం ఖర్చు చేస్తారు. ఆర్థికవిషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. ప్రతి పనిలో దూకుడు వద్దు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.




ఆడంబర ఖర్చులు అధికం. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి. ఇన్నినాళ్ళు ఆటంకాలతో అడ్డుపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. విరోధుల ప్రాబల్యం ఎక్కువ. అవగాహన లేకుండా పూనికలు వద్దు. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం.




వైద్యశాలలను సందర్శిస్తారు. గాయలు తగిలే ప్రమాదం ఉంది. శారీరక మానసిక బాధలు తప్పవు. వ్యాపారులకు గడచిన వారం కన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఇంటిలో వివాహ సంబంధవిషయాలు ప్రస్తావనకు వస్తాయి. బంధుమిత్ర సమాగమం ఊరటనిస్తుంది. రాజకీయులకు దురదృష్టకాలం.

## పంచాంగం

14తేదీ నాగపంచమి.
15తేదీ స్వాతంత్ర్య దినోత్సవం.
20తేదీ వరలక్ష్మీ వ్రతం

### శుభ ముహూర్తాలు

15తేదీ సింహలగ్నాన ఉ.7.00 నుంచి 8.00 గంటల వరకు.
19తేదీ కర్కాటక లగ్నాన తె.3.30 నుంచి 4.30 గంటల వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### ఆగష్టు తిథులు

శ్రావణ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 14 | శని | పంచమి | సా.3.25 | గం.ల.వ |
| 15 | ఆది | షష్ఠి | మ.1.20 | గం.ల.వ |
| 16 | సోమ | సప్తమి | ఉ.11.57 | గం.ల.వ |
| 17 | మంగళ | అష్టమి | ఉ.11.00 | గం.ల.వ |
| 18 | బుధ | నవమి | ఉ.11.28 | గం.ల.వ |
| 19 | గురు | దశమి | మ.12.16 | గం.ల.వ |
| 20 | శుక్ర | ఏకాదశి | మ.1.39 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




ముందుచూపుతో అడుగేయాలి. ప్రతివిషయంలో ఎదుటివారు తప్పుగా అంచనా వేస్తారు. ముఖ్యమైన వాటిని వాయిదా వేయడం మంచిది. నరాలకు సంబంధించిన బాధలధికం. కళత్ర ఆరోగ్యం, సంతానమూలంగా మానసిక వేదనకు గురవుతారు. ప్రయాణాలు కోరినరీతిలో జరుగవు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. విద్యార్థులకు కొంత మేలు.




అనవసరపు అప్రతిష్ఠలకు గురవుతారు. మాటల వల్ల వృథాగా ఇబ్బందులకు గురవుతారు. పురప్రముఖుల పరిచయం ఆనందాన్నిస్తుంది. మనశ్చాంచల్యం ఉంటుంది. ఖర్చులు కూడా అధికం. విశ్రాంతి తక్కువ. జాయింటు వ్యవహారాలు చక్క దిద్దుకొంటారు. ఆకస్మిక సంఘటనలకు అవకాశాలున్నాయి. ఇంటిలో ఆనందదాయకమైన పరిస్థితులు చోటు చేసుకొంటాయి.




శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. సంతాన కారణంగా మనశ్చింత. సరైయిన నిర్ణయాలు తీసుకోలేరు. మిత్రులతో కలసి వినోదయాత్రలు చేసే అవకాశాలున్నాయి. వ్యాపార విస్తరణకు నూతన ప్రయత్నాలు చేస్తారు. కొత్త విషయాలు తెలుసుకొనే ప్రయత్నాలు చేస్తారు. వృత్తి ఉద్యోగాల్లో కోరుకొన్న మార్పులు చేర్పులు జరిగే సూచనలు. లేదా నూతనోద్యోగ ప్రాప్తి.




ఆరోగ్యవిషయంలో అతిజాగ్రత్త అవసరం. కళత్ర ఆరోగ్యం కూడా అంతంత మాత్రమే. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. మాటలు వదలడంలో జాగ్రత్త అవసరం. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. వివిధమార్గాల ధనప్రాప్తి. సోదరుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలలో పురోభివృద్ధి చక్కగా ఉంటుంది. చిన్న చిన్న విరోధాలు మనశ్శాంతిని చెడగొడతాయి.




పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. కుటుంబంలో కలతలకు అవకాశాలు. ధనవిషయాలలో లోటు లేదు. మానసిక ఆందోళనకు గురవుతారు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. ఉద్యోగులకు పై అధికారుల నుండి నిరాదరణ. రాజకీయులకు ఉత్తమకాలం. వ్యాపారులకు మంచి లాభావకాశాలు.




శుభకార్యాలలో విందు వినోదాలలో పాలు పంచుకొంటారు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. తొందర పాటు నిర్ణయాలు వద్దు. ఓపిక అవసరం. వివాహాది శుభకార్యప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు బాగా సాగుతుంది. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగా ఉండాలి.

# భారతీయ జ్యోతిష శాస్త్రానికి విదేశీయుల ప్రశంసలు!

*డాక్టర్ మేరీజాన్ సుజాత చెన్నై*

** భారతీయ జ్యోతిషశాస్త్రంపై విదేశీయుడి తిరస్కారం ఈ మధ్య ఒక ఆంగ్ల వ్యాసం చదివాను.*

విదేశీ జ్యోతిష శాస్త్రవేత్తలైన లార్డ్‌బెకన్, కెప్లర్, డ్రైడన్ 'కాలిఫోర్నియా' సదస్సులో భారత ప్రాచీన మహర్షులు మేధోసంపత్తిని, శాస్త్ర ఔన్నత్యాన్ని ఆకాశానికెత్తిన విషయం తెలిస్తే పుచ్చల కిష్టోఫర్ అలా వ్యాసం రాసేవాడు కాదేమో. ఏమైనా సగం సగం తెలిసిన విషయాలతో త్వరపడి వ్యాసం రాయడం అతని అల్పబుద్ధికి నిదర్శనం.

*తాడిపత్రి రమణయ్య సైదాపురం*

** ఈశాన్యం 'చిన్నికుండ' చాలా బాగా పని చేసింది.*

ఇంట్లో 'మనుషులు', పశువులు రోగగ్రస్థులవుతున్నప్పుడు ఈశాన్యం చిన్న కుండలో పసుపు, ఆవాలు, సాంబ్రాణి, జిల్లేడు పూలు, కర్పూరం, గుగ్గిలం మూటకట్టడాన్ని 'అగస్త్ర ధర్మకతువు' 'మృణ్మయ బంధనం' అంది. ఇది శాస్త్రీయంగా కూడా ఆరోగ్య హేతువే.

*పఠాన్ మెహెరున్నీసా నెల్లూరు*

** మా వారు వాస్తును నమ్మరు. ఇప్పుడు అనుభవిస్తున్నాం.*

ప్రహరీ లేక, దిక్కుల్లో స్థలాలు వదలక, దేవుడి గది కూడా లేక మీ గృహం 'ఓ భూత' గృహంలా వుంది. 'బయ్యా' అంటూ ఉత్తరం రాశాక తప్పక మీ పరిస్థితిని సరిచేస్తాను. అది నా బాధ్యత కూడా బెహెన్!

*పి.సత్యనారాయణశర్మ ఒంగోలు*

** ఆమె కోలుకొంటుంది, మళ్ళీ మంచాన పడుతుంది. అంతా అయోమయంగా వుంది?*

దక్షిణ, ఆగ్నేయ దిశాలోపాల్ని వెంటనే సవరించుకోండి. ఈలోగా 'లక్ష్మీకృత వాస్తు యంత్ర' ప్రతిష్ట చేసుకోండి.

*పి.వి.సత్యవతమ్మ తడ*

** ఈ సంవత్సరం చదువులో అమ్మాయి బాగా వెనుకబడి పోయింది?*

ముత్యం, పగడం కుడి ఉంగరం, చిటికెన వ్రేళ్ళకు ధరింపజేయండి. ఇంట్లో 'సుదర్శన యంత్ర' ప్రతిష్ట చేయించండి. ఫలితం వుంటుంది.

*జి.సువర్చలారెడ్డి చెన్నై*

** మామిడి చెట్టును తీసేశాక ఆయనకు ప్రమాదం జరిగింది.*

మనిషి హత్య, చెట్టు నరికివేత, రెండూ ప్రాణులకు సంబంధించినవే. అవి ఆత్మలై 'ఘోష శాపం' ఇస్తాయని శాస్త్రాలు చెబుతున్నాయి. 'వాస్తు యంత్ర' ప్రతిష్ట చేయండి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎం.విక్రమ్‌సిద్ధారెడ్డి కడప*

** ఉత్తరం స్థలంలో గృహ నిర్మాణం చేశాము. పరిస్థితులేమీ బాగోలేవు?*

మీకు తూర్పు రవి స్థానం కలసి వస్తుంది. ఉత్తరం బుధస్థానం, నపుంసక స్థానం. పైగా గృహ నిర్మాణంలోని వాస్తులోపాల్ని వెంటనే సవరించుకోండి. మత్స్యయంత్ర ప్రతిష్ట కొంత మేలు చేస్తుంది.

*వై.ఆర్.సరస్వతమ్మ గూడూరు*

** నైరుతి గుంట పూడ్చేశాక, ఆయన మళ్లీ మామూలు మనిషయ్యారు.*

నిరుతి(రాక్షస) స్థానం భ్రంశమయితే అనారోగ్యం, మృత్యువు తప్పనిసరి. మంచి పని చేశారు. వెంటనే శక్తి యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

*జి.సత్యనారాయణ బెంగుళూరు*

** ఇళ్లకు ఎదురయ్యే వీధులు ఎన్ని? అవి ఏవి?*

ఏక పథం నుంచి అష్టజ, నవ, దశపథాలని పది రీతులని 'గార్గ సంహిత' చెబుతోంది. మీది ఈశాన్య వీధి చూపైనా 'దృష్టిదోషాన్ని' కలిగిస్తుంది.

*వి.ఎస్.రెడ్డి హైదరాబాద్*

** నెల్లూరులో ఇల్లుంది. మూడు మాసాలకొకమారు ఫ్యామిలీతో దిగుతుంటాను.*

ఎంత కాపలాదారున్నా రాత్రిళ్లు దీపాలు వెలగాలి. నిత్యం ఇంట్లో మనుషులు తిరుగుతూ వుండాలి. మండలం రోజులు ఇలా జరుగకపోతే దుష్టగ్రహ ఆవాహం జరుగుతుందని శాస్త్రాలు చెబుతున్నాయి.

# విడవలూరును వీడని సమస్యలు!



విడవలూరు గ్రామ పంచాయితీ కార్యాలయం.

విడవలూరు గ్రామ పంచాయితీ పేరుకే మేజర్‌గా వున్నా సాధారణ గ్రామ పంచాయితీలో చేపట్టినన్ని అభివృద్ధి పనులు కూడా ఇక్కడ చేపట్టలేదు. లక్షలాది రూపాయల పన్నులు వసూలు కావాల్సి వున్నప్పటికీ అవసరమైన సిబ్బంది లేకపోవడంతో పన్నులు వసూలుకాక పేరుకు పోతున్నాయి. ఈ పంచాయితీలో అనేక సమస్యలు వున్నా పట్టించుకునే దిక్కు లేకుండా పోయింది. డ్రైనేజి, పారిశుధ్యం, అంతర్గత రోడ్లు, వీధిలైట్లు తదితర సమస్యలు ప్రజల్ని పట్టి పీడిస్తున్నాయి.

విడవలూరు గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా కాంగ్రెస్ పార్టీకి చెందిన మాతూరు జయలక్ష్మి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఈమె కోవూరు మాజీ ఎమ్మెల్యే పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి సోదరి. సర్పంచ్‌గా ఎన్నికై దాదాపు నాలుగున్నర సంవత్సరాలు పూర్తి కావస్తున్నా ఈమె హయాంలో ఎటువంటి అభివృద్ధి పనులు చేపట్టిన దాఖలాలు లేవు. ఈ పంచాయితీ పరిధిలో జాన్‌పేట, మన్మధరావుపేట, రామస్వామికండ్రిగ, వడ్డిపాళెం, ముసలారెడ్డిగుంట తదితర కాలనీలున్నాయి. రెండు వేల కుటుంబాలు, పదివేల మంది జనాభా, ఆరు వేల మంది ఓటర్లు ఇక్కడున్నారు.

### నిధుల కొరత!



గ్రామ పంచాయితీలో అభివృద్ధి పనులు చేపట్టేందుకు నిధుల కొరత తీవ్రంగా వుంది. పంచాయితీకి వసూలు కావాల్సిన పన్నులు సక్రమంగా వసూలు కావడం లేదు. ప్రస్తుతం బకాయిలు పది లక్షలకు పైగా పేరుకు పోయాయి. ప్రభుత్వం నుంచి నిధులు మంజూరైతే డ్రైనేజి కాల్వల నిర్మాణం, అంతర్గత రోడ్లకు గ్రావెల్ వేయడం వంటి పనులు చేపట్టే అవకాశం వుంటుంది.

– **షేక్ యజ్దాని**, కార్యదర్శి

ప్రతి సంవత్సరం గ్రామ పంచాయితీకి వివిధ పన్నుల రూపంలో దాదాపు ఆరు లక్షల రూపాయలు వసూలు కావాల్సి వుంటుంది. బిల్ కలెక్టర్ లేకపోవడం, కాంట్రాక్టు సిబ్బందిని పన్నుల వసూళ్లకు పంపడంతో సక్రమంగా వసూళ్లు చేయలేకపోతున్నారు. ఇప్పటికీ దాదాపు పది లక్షల రూపాయల మేర బకాయిలు పేరుకుపోయి వున్నాయి. ఇవి కాకుండా ఎస్ఎఫ్‌సి, 12వ ఆర్థిక సంఘం నిధులు మరో రెండు లక్షలకు పైగా ప్రభుత్వం గ్రాంటు రూపంలో విడుదల చేస్తుంది. వున్న నిధుల్ని సక్రమంగా వినియోగించుకుంటే పంచాయితీలో పలు సమస్యలను పరిష్కరించవచ్చు. ప్రస్తుతం గ్రామ పంచాయితీకి వసూలవుతున్న పన్నులు కాంట్రాక్టు సిబ్బంది జీతభత్యాలకే చాలకుండా పోతున్నాయి. ఇతర పనులు చేసేందుకు నిధుల కొరత ఏర్పడుతుంది. గతంలో ఎమ్మెల్యేగా వున్న పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి హయాంలో కూడా ఈ పంచాయితీలో అభివృద్ధి పనులు చేపట్టేందుకు కృషి చేయలేదన్న విమర్శలు వున్నాయి. మండలాలకు కేటాయించిన 90 లక్షల రూపాయల నిధులలో దాదాపు 50 వేల రూపాయలు ఖర్చుచేసి దళితవాడ సమీపంలో సిమెంటు రోడ్డు నిర్మాణం చేపట్టినట్లు చెబుతున్నారు. సర్పంచ్ అధికార పార్టీకి చెందిన మహిళ కావడం, ఎమ్మెల్యేకు స్వయాన సోదరి కావడం వల్ల అభివృద్ధి జరుగుతుందని స్థానిక ప్రజలు భావించారు. అయితే వారు భావించినట్లుగా అప్పటి ఎమ్మెల్యే సహకారం ఏమాత్రం అందలేదు. ప్రస్తుత ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి టిడిపి తరపున గెలుపొంది, అధికార పార్టీకి చెందిన నేతలతో సన్నిహితంగా వుంటున్నా కూడా పంచాయితీ అభివృద్ధికి కృషి చేయడం లేదు. త్వరలో స్థానిక సంస్థలకు ఎన్నికలు జరుగనున్న దృష్ట్యా గ్రామ పంచాయితీ పరిధిలో రాజకీయ సమీకరణలు జరుగుతున్నాయి. సర్పంచ్ మహిళ కావడం, అందులో అగ్రవర్ణానికి చెందినామె కావడం వల్ల సామాన్య ప్రజలు తమ సమస్యలను తెలుపుకొనేందుకు భయపడుతున్నారు.


వీధుల్లో పేరుకపోయిన చెత్తాచెదారాలు.

**అవినీతి కథ**

● సాంఘిక సంక్షేమ శాఖ ఇఇ కార్యాలయంలో

# ప్రతి పనికి ఓ రేటు!

**నెల్లూరులోని సాంఘిక సంక్షేమశాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ కార్యాలయం అవినీతి, అక్రమాలకు కేంద్ర బిందువుగా మారింది. ఇక్కడి సిబ్బంది, ఇంజనీర్లు ప్రతి పనికి ఒకరేటు నిర్ణయించి కాంట్రాక్టర్లను హడలెత్తిస్తున్నారు.**



ఇఇ కార్యాలయాన్ని పర్యవేక్షించని సంక్షేమాధికారులు. (ఫైల్‌ఫోటో)

జిల్లా సాంఘిక సంక్షేమ శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ కార్యాలయం అవినీతి, అక్రమాలకు కేంద్ర బిందువుగా మారిపోయింది. ఈ కార్యాలయం ఆధ్వర్యంలో చేపట్టే పనులకు కాంట్రాక్టర్ల నుంచి లంచాలు వసూలు చేస్తున్నారు. కార్యాలయ పనితీరును పర్యవేక్షించేవారు లేకపోవడంతో ఇంజనీర్లు, సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు. ప్రతి పనికి ఒక రేటు నిర్ణయించి కాంట్రాక్టర్లను హడలెత్తిస్తున్నారు.

సాంఘిక సంక్షేమ శాఖ పరిధిలో నూతనంగా హాస్టళ్లు, కార్యాలయాల భవనాలు నిర్మించే బాధ్యతలను ఇంజనీరింగ్ విభాగానికి ప్రభుత్వం అప్పగిస్తుంది. నూతన భవనాలను నిర్మించడంతోపాటు భవనాల మరమ్మత్తులను కూడా అధికార్లు చేపడుతుంటారు. అయితే ఈ పనులు చేసే కాంట్రాక్టర్ల నుంచి మామూళ్లు వసూలు చేయడంతో పనులు నాసిరకంగా జరుగుతున్నాయి. దీంతో కొద్ది కాలానికే లక్షలాది రూపాయలు ఖర్చుచేసి నిర్మించిన భవనాలు శిథిలావస్థకు చేరుకొంటున్నాయి.

ఈ శాఖ పరిధిలో వున్న హాస్టళ్ల భవన నిర్మాణం, మరమ్మత్తులకు ప్రభుత్వం నుంచి గుట్టుచప్పుడు కాకుండా నిధులు మంజూరు అవుతుంటాయి. జిల్లా కలెక్టర్‌తోపాటు ప్రజా ప్రతినిధులకు ఎవరికి కూడా ఈ నిధుల గురించి సమాచారం వుండదు. జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశం, డిఆర్‌సి సమావేశం సందర్భంగా అజెండాలో చేర్చి ప్రశ్నించిన సమయంలో మాత్రమే కొంత సమాచారం అందిస్తారు.

నెల్లూరు నగరంలో ఆటోనగర్ శివారు ప్రాంతంలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ కార్యాలయం ఏర్పాటుచేసి వున్నారు. ఈ విభాగం అధికారుల పర్యవేక్షణలో నిర్మించిన హాస్టల్ భవనాలన్నీ కొద్ది నెలలకే మరమ్మత్తులకు గురయ్యాయి. గూడూరు డివిజన్‌లో చెన్నూరులో హాస్టల్ భవనం స్లాబ్ పెచ్చులు పడి గతంలో ఒక విద్యార్థి తీవ్రగాయాల పాలైనాడు. గాయాలు తగిలిన ఈ విద్యార్థికి హాస్టల్ వార్డెన్ ప్రైవేటు ఆసుపత్రిలో చికిత్స చేయించి రహస్యంగా ఇంటికి పంపాడు.

ఈ సంఘటన కేవలం ఉదాహరణ మాత్రమే. బయటకు రాని సంఘటనలకు అనేకం వున్నాయి. ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా వున్న సత్యమూర్తి ఎప్పుడూ కార్యాలయంలో అందుబాటులో వుండడు. ఏదో ఒక క్యాంపు పేరు చెప్పి బయట తిరుగుతుంటాడు. ఉదయం 10.30 గంటలకు కార్యాలయానికి రావాల్సిన ఇతర సిబ్బంది 12 గంటలకు వస్తుంటారు. వాచ్‌మెన్ మాత్రమే ఇక్కడ అందుబాటులో వుంటున్నాడు. జిల్లా సాంఘిక సంక్షేమ శాఖ డిప్యూటీ డైరక్టర్ సీతామహాలక్ష్మి ఇంజనీరింగ్ విభాగంపై దృష్టి సారించడం లేదు.

అందరూ అవినీతి, అక్రమాలకు పాల్పడేవారు కావడం వల్ల ఒకరినొకరు ప్రశ్నించే అధికారం కోల్పోతున్నారు. రాష్ట్ర ప్రభుత్వం కోట్ల రూపాయలు హాస్టల్ భవనాలకు కేటాయిస్తున్నా ఇక్కడ అధికారులు అవలంభిస్తున్న వైఖరి కారణంగా నాణ్యతా ప్రమాణాలకు నోచుకోలేక పోతున్నాయి. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి సాంఘిక సంక్షేమ శాఖ ఇంజనీరింగ్ విభాగం పనితీరు, నిధుల మంజూరు, ఖర్చుల వ్యవహారంపై సమీక్షించాల్సిన అవసరం ఎంతైనా వుంది.



# రవితేజ మార్కు 'డాన్‌శీను'!



అల్లూరు రహీం

ఏడాదికి నాలుగు చిత్రాల్లో నటిస్తున్న ఏకైక తెలుగు హీరో ఎవరంటే తడుముకోకుండా రవితేజ అని సమాధానం చెప్పొచ్చు. పరిశ్రమలో మినిమం గ్యారంటీ హీరోగా గుర్తింపు పొందిన రవితేజను హీరోగాపెట్టి ఆర్.ఆర్. మూవీమేకర్స్ పతాకంపై తీసిన చిత్రమే డాన్ శీను. ఈ చిత్రానికి నూతన దర్శకుడు మలినేని గోపిచంద్ దర్శకత్వం వహించినా ఎక్కడా ఆఛాయలు కనపడవు. సీనియర్ రచయితలు కోన వెంకట్, వెలిగొండ శ్రీనివాస్ సహకారంతో కథను విస్తరింపజేసుకోవడంతోపాటు నవరసాలు ఇందులో వుండేలా జాగ్రత్తలు తీసుకొన్నాడు. 16రీళ్ల ఈ సినిమాలో పాటలు, సంగీతం, హాస్యం, పోరాటాలు సమపాళ్లలో కుదరడంతో విసుగనిపించదు. వన్నెలుచిందె హీరోయిన్లు శ్రియ, అంజనా సుఖాని ఈ చిత్రానికి అదనపు శోభ చేకూర్చారు. రవితేజ చిన్నతనంలో డాన్ చిత్రం విడుదల కావడం, అతను స్కూల్ ఎగ్గొట్టి సినిమాకు వెళ్లడం, పిల్లలను డాన్ మానియాలోనికి తీసుకవెళ్లడం వంటి సన్నివేశాలు మంచి హాస్యరసాన్ని ఒలికిస్తాయి. కథతోపాటు కలిసిన హాస్య పాత్రల్లో బ్రహ్మానందం, వేణుమాధవ్, అలీ, రఘుబాబు, పోటాపోటీగా నటించారు. వీరికి ఏ మాత్రం తగ్గకుండా హీరో రవితేజ మంచి హాస్యపు జల్లు కురిపించాడు. మణిశర్మ సంగీతం సమకూర్చిన పాటలు వంటిపేరు శీను, లవ్ చేయరా, అందమేమో విస్తరాకు, అడుగుతుంది, రాజ రాజ రవితేజలను కెమెరామెన్ సమీర్‌రెడ్డి జర్మనీ లొకేషన్లతోపాటు కళాదర్శకుడు ప్రకాష్ వేసిన సెట్టింగుల్లో అందంగా చిత్రీకరించాడు. హీరోయిన్ శ్రియ నోట మూసుకో, నీయమ్మ, నీ అంత బలుపుగాడు, హీరో రవితేజ నోట దొంగముండ వంటి గలీజు మాటలు పలికించడం కుటుంబ సమేతంగా చిత్రాన్ని చూడను వెళ్లినవారు ఇబ్బందిపడతారు. కోన వెంకట్ వ్రాసిన అందమంటే చూడాలనిపించాలి... చూసిందనిపించకూడదు. సైకాలజిని సైకిల్ తొక్కినట్లు తొక్కేస్తాను. ప్రేమించినవాళ్లు తలదించుకోరు వంటి మాటలు బాగున్నాయి. సాఫీగా నడుస్తున్న చిత్రకథలో విశ్రాంతికి ముందు, అదేవిధంగా చిత్రం ముగిసేముందు డాన్ శీను అసలు రూపం ఆవిష్కరణకు వాడిన ట్విస్టులు బాగున్నాయి.




చిత్రకథలోనికి వెళ్తే డాన్ శీను (రవితేజ)కు బిగ్‌బి అమితాబచ్చన్ నటించిన చిత్రాలంటే భలేయిష్టం. ఆయన నటించిన డాన్ సినిమా చూసి తాను డాన్ కావాలని కలలు కంటాడు. తల్లి (సుధ) మందలించడంతో ఇంటి నుంచి పలాసకు పారిపోతాడు. అక్కడ ఓ సినిమా ఆపరేటర్ కుటుంబం యితన్ని ఆదరిస్తుంది. అక్కడ నుంచి హైదరాబాద్ వచ్చే శీను నగరంలోని అండర్ వరల్డ్ డాన్‌లు నర్సింగ్ (శ్రీహరి), మాచిరాజు (షాయాజీషిండే) దృష్టిలో పడను వీరిని కంట్రోల్ చేసే పెద్ద డాన్ దుగ్గల్ (మహేశ్ మంజ్రేకర్) కుమారుడిని ఓ బారులో చావచితక కొడతాడు. దీంతో మాచిరాజు శీనును పిలిపించి దుగ్గల్‌తో ఫోన్‌లో మాట్లాడుతూ అతన్ని చంపినట్లు సీన్ క్రియేట్ చేస్తాడు. తాను ఈ పని చేయలేకపోయినందుకు నర్సింగ్ చింతిస్తాడు. మాచిరాజు పశ్చిమ జర్మనీలో వుండే నర్సింగ్ చెల్లెలు ప్రియ (అంజనా సుఖాని)ని ప్రేమించమని శీనును అక్కడకు పంపిస్తాడు. ఇతడ్ని జర్మనీ తీసుకెళ్లే బాబి (బ్రహ్మాజీ) కావాలని మాచిరాజు చెల్లెలు (శ్రియ)ను అతనికి చూపించి వస్తాడు. తానో ఫ్యాషన్ ఫోటోగ్రాఫర్‌నంటూ శీను దీప్తిని తన కౌగిట బంధిస్తాడు. శీను గూర్చి ఆరాతీస్తుండే నర్సింగ్‌కు అతనెందుకు జర్మనీ వెళ్లాడన్న సందేహం పట్టిపీడిస్తుంటుంది. ఇంటర్వెల్‌కు ముందు శీను దీప్తితో విమానం దిగడంతో నర్సింగ్ ఎంతగానో సంతోషిస్తాడు. అక్కడ నుంచి నర్సింగ్ పక్షాన చేరే శీను అతని చెల్లెలు శ్రియను ప్రేమించినట్లు నాటకం ఆడుతాడు. దుగ్గల్ తన కుమారునికి నర్సింగ్ చెల్లెల్ని ఇచ్చి వివాహం చేయ తలపెడతాడు. శీను దుగ్గల్‌కు ఫోన్‌చేసి శ్రియ క్యారక్టర్ మంచిది కాదంటాడు. దీంతో ఈ వ్యవహారం పరిశీలనకు అతను విశ్వాస్ (బ్రహ్మానందం)ను పంపుతాడు. అతని పరిశీలనలో డాన్ శీను ఖతర్నాక్ అని ఇటు శ్రియ, అటు దీప్తితో అతను ప్రేమను కొనసాగిస్తున్నాడని తెలుసుకొంటాడు. చివరి సన్నివేశంలో శీను తనను చిన్నతనంలో చేరతీసిన కుటుంబాన్ని నర్సింగ్, మాచిరాజులు మోసం చేయడం వల్ల తాను వారి కుటుంబాల్లో యువతులను ప్రేమించి గందరగోళం చేశానంటాడు. నర్సింగ్, మాచిరాజు తమను క్షమించమని శీనును కోరుతారు. దీప్తి, శీను ఒకటి కావడంతో చిత్రం ముగుస్తుంది.

## వెనుకబడ్డ హన్సిక!



అందాల హీరోయిన్ హన్సిక తెలుగు చిత్రాల్లో అసలు కనపడడం లేదు. సీతారాముల కళ్యాణం లంకలో చిత్రం తర్వాత ఈ చిన్న దాని జాడ లేదు. ఈ మధ్య ఆమె చెన్నైలో తళుక్కున మెరిసింది. తమిళనటుడు విజయ్ సరసన హీరోయిన్‌గా నటించే ఛాన్స్ కొట్టేసింది. అన్నట్లు ఈ సినిమాలో ఆమె మెయిన్ హీరోయిన్ కాదు. జెనీలియా తర్వాతి స్థానంలో నటిస్తుంది. ఇదేమిటంటే నాకు పాత్రే ముఖ్యం. నేనేంటో నిరూపించుకొంటా అంటూ ఓ రొటీన్ డైలాగ్ కొట్టింది. తెలుగులో కొన్ని చిత్రాలు ఆమె ముందుకు వచ్చినా చేసిన డిమాండ్ల కారణంగా నిర్మాతలు ఆమెని వదలుకొన్నారట. అయినా సినిమాలు లేనప్పుడు గొంతెమ్మ కోర్కెలు ఎందుకో?

## స్వశక్తిని నమ్ముకోవాలి!



12 ఏళ్లకు పైగా బాలీవుడ్‌లో అందమైన రూపం, శృంగారం ఒలికే చూపులతో యువతను ఆకర్షిస్తున్న తార బిపాసబసు. ఈ మధ్య ఆమె మహిళా పక్షపాతిగా మారి మాట్లాడుతుంది. నాకు 16 సంవత్సరాల వయసొచ్చే దాకా నా జీవితంలో పెద్దగా మార్పు లేమీ జరగలేదు. కాలేజ్ చదువుతున్నప్పుడు మోడలింగ్ పోటీలో పాల్గొన్నాను. అక్కడితో నా జీవితమే మారిపోయింది. ఏది ఏమైనా మహిళలకు ఆర్థిక స్వాతంత్రం కావాలి. స్వశక్తిని నమ్ముకోవాలి. అప్పుడే ఆనందంగా వుంటారు. మహిళలు తమ కోసం బ్రతకాలి. అంతా ఇతరుల కోసమే అనే పద్ధతి మార్చుకోవాలంటుంది.

## నేను హాస్య నటుడినే!



మర్యాద రామన్న చిత్ర విజయాన్ని హీరో సునీల్ ఆస్వాదిస్తున్నాడు. ప్రేక్షకులు మర్యాదతో కూడిన ఆదరణ ఇస్తున్నట్లు చెప్పుకొచ్చాడు. నేనో హాస్య నటుడిని. నా సినిమా 325 ప్రింట్లతో ప్రేక్షకుల ముందుకు వెళ్లడం మామూలు విషయం కాదు. ఈ విజయం తాలుకు క్రెడిట్ మొత్తం దర్శకుడు రాజమౌళిదే. నన్ను హీరో అనకండి. తెలుగు సినిమాల్లో నా పోర్ట్‌ఫోలియో కమెడియన్. హీరోగా కొనసాగాలనే ఆలోచన నాకు లేదు. మిరపకాయ్, బద్రీనాథ్ చిత్రాలలో కమెడియన్‌గా కనపడుతున్నట్లు చెప్పుకొచ్చాడు సునీల్.

## గ్లామర్‌గా కనపడడం తప్పా?



బాలీవుడ్‌లో శృంగార నాయికగా గుర్తింపు తెచ్చుకొన్న నీతూకి నోరెక్కువ. అదేమిటంటే ముక్కుసూటిగా మాట్లాడేతత్వమంటుంది. గ్లామర్‌గా కనపడడంపై మాట్లాడుతూ తెరపై అందంగా కనపడే దానికి ఎవరికి ఇష్టముండదు చెప్పండి? మామూలుగానే అందంగా కనిపించాలని ప్రతి స్త్రీ ఆరాటపడుతుంది. నేను కూడా అందరిలాంటి దాన్నే. ఈ విషయంలో ఎటువంటి సందేహం లేదు. శృంగార రసాన్ని తప్పుపట్టడం శుద్ధతప్పు. భారతదేశంలో ప్రసిద్ధ కట్టడాలను, పుణ్యక్షేత్రాల్లోని దేవాలయాలను ఒకసారి చూసి ఈ అంశంపై మాట్లాడమంటుంది.

## హీరోలు ఎక్కువ సినిమాలు చేయాలి!



హీరోలు ఎక్కువ చిత్రాలు చేసినప్పుడే పరిశ్రమ కళకళలాడుతుందని దర్శకుడు దాసరి నారాయణ రావు స్పష్టం చేశారు. డాన్ శీను ఆడియో వేడుకల్లో మాట్లాడుతూ వరుసగా సంవత్సరానికి నాలుగు చిత్రాలు చేస్తున్న హీరో రవితేజను అభినందిస్తున్నాను. మిగతా తెలుగు హీరోలు ఇదే బాటన నడవాలి. వందరోజుల సినిమా వేడుకలు లేకపోవడంతో ఆడియో వేడుకలు ఆ విధంగా చేస్తున్నారని దాసరి తన మనసులో మాటను కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పాడు.

## విద్యార్థులు ఇబ్బంది పడకూడదు

వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ విద్యార్థులకు ఫీజులు, స్కాలర్‌షిప్పులు సక్రమంగా అందేలా చర్యలు తీసుకోవాలని జిల్లా కలెక్టర్ రాంగోపాల్ ఆదేశించారు. ఈ విషయమై కలక్టరేట్‌లోని తన ఛాంబర్‌లో వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖాధికారులతో ప్రత్యేక సమావేశం పెట్టారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ బిసి విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు, ఫీజుల బకాయిల చెల్లింపుకు



### బిసి సంక్షేమ శాఖాధికారులకు కలెక్టర్ సూచన

ప్రభుత్వం 21 కోట్ల రూపాయలు మంజూరు చేసిందని, ఇంకా 14 కోట్ల రూపాయలు రావలసి వుందన్నారు. విడుదలైన సొమ్మును ట్రెజరీ ద్వారా విద్యార్థులకు పంపిణీ చేస్తామన్నారు. బిసి హాస్టళ్లలో మరో రెండువేల మంది విద్యార్థుల ప్రవేశానికి ప్రతిపాదనలు పంపామన్నారు. బిసి హాస్టళ్ల రిపేరుకు రాజీవ్ విద్యామిషన్ నుండి కొంత సొమ్ము మంజూరు చేస్తామని ఆ మొత్తాలతో హెచ్.డబ్ల్యు.ఓలు పేరెంట్స్ కమిటీతో రిపేర్లు చేయించాలని సూచించారు. జిల్లాలో ఖాళీగా వున్న 15 హెచ్.డబ్ల్యు.ఓల పోస్టులు వెంటనే భర్తీ చేస్తామన్నారు. బిసి సంక్షేమ అధికారి వై.వి.మోహన్‌రావు, కార్యాలయ సూపరింటెండెంట్ చంద్రహాస్ తదితరులు ఈ సమీక్షా సమావేశంలో పాల్గొన్నారు.

## రోడ్ల నిర్మాణానికి 400 కోట్లు!

ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన ఫేజ్1, ఫేజ్2 లలో భాగంగా చేపట్టిన రహదారుల నిర్వహణ కోసం నిధులు మంజూరయ్యాయి. జిల్లాలో 280 కిలోమీటర్ల మేర 93 రహదారుల మరమ్మత్తుల నిమిత్తం 400 కోట్ల రూపాయలను కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసింది. 2002, 2003 సంవత్సరాలలో నిర్మించిన రహదారుల మరమ్మత్తులకు వినియోగిస్తారు. పంచాయితీరాజ్ ఇంజనీరింగ్ విభాగం ఆధ్వర్యంలో ఈ పనులు చేపడుతారు. ఈ 400 కోట్ల రూపాయలను పటిక బెల్లంలా చప్పరించకుండా రహదారుల పటిష్ఠతకు వినియోగించేలా అధికారులు చర్యలు తీసుకొంటే బాగుంటుంది.



దెబ్బతిన్న గ్రామీణ రోడ్లకు ఇక మోక్షం. (ఫైల్‌ఫోటో).

## విద్యాసంస్థల మధ్య వివాదం

నగరంలో ప్రైవేటు విద్యాసంస్థలు పుట్టగొడుగుల్లా వెలుస్తున్నాయి. విద్యాశాఖ నియమ నిబంధనలకు అనుగుణంగా ప్రభుత్వ గుర్తింపు, పాఠశాల ఏర్పాటుకు అనుమతి ఇవ్వాల్సి వుండగా అది అమలు కావడం లేదు. దీని ప్రభావం విద్యాసంస్థల మధ్య వివాదానికి దారి తీస్తుంది. రామలింగాపురం మినీ బైపాస్‌రోడ్డులో ఒక మహిళ కరస్పాండెంట్‌గా పాఠశాలను నిర్వహిస్తుంది. దీనికి సమీపంలో ఇటీవల విజయవాడతోపాటు రాష్ట్రంలో పలు కేంద్రాలలో స్కూళ్లను నిర్వహిస్తున్న సంస్థ క్రొత్తగా స్కూలును నెలకొల్పడంతో రెండు పాఠశాలల మధ్య గొడవకు దారి తీసింది. మహిళా కరస్పాండెంట్ తమ స్కూలు ప్రక్కనే క్రొత్త స్కూలుకు ఎలా పర్మిషన్ ఇస్తారంటూ విద్యాశాఖ అధికారులను ప్రశ్నించారు. దీంతో అధికారులు

### విద్యాశాఖనే కారణం

ఆ పాఠశాలను రెండు వీధుల అవతలకు మార్పించారు. దీనిని వ్యతిరేకిస్తూ విద్యాశాఖ అధికారులపై కోర్టుకు వెళ్లింది కరస్పాండెంట్. కోర్టు స్టే ఇచ్చినప్పటికీ క్రొత్త టెక్నో స్కూలు యాజమాన్యం తమ పలుకుబడిని ఉపయోగించి ఆర్‌జెడి స్థాయి అధికారికి లక్షల్లో సొమ్ము ముట్టజెప్పడంతో ఆయన ఆదేశాల మేరకు జిల్లా విద్యాశాఖ అనుమతి ఇచ్చి వేసింది. దీంతో అగ్గిమీద గుగ్గిలం అయిన ఆమె కోర్టును ధిక్కరించారంటూ న్యాయస్థానాన్ని ఆశ్రయించేందుకు తగిన చర్యలు చేపట్టడంతోపాటు అసోసియేషన్‌ను కలసి మద్దతు తెలపాలని కోరినట్లు సమాచారం. అయితే ఆ కరస్పాండెంట్, ఆమె భర్త వ్యవహారం అసోసియేషన్ నాయకులకు నచ్చకపోయినప్పటికీ బయట నుంచి వచ్చి స్కూళ్లు ఏర్పాటుచేసే వారి వలన తమ మనుగడకు నష్టం వాటిల్లనుండడంతో విద్యాశాఖ తీరుపై నిరసనకు దిగనున్నట్లు సమాచారం.

## ఆగష్టు 15పై సమీక్ష

స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల ఏర్పాట్లపై జిల్లా కలెక్టర్ కె.రాంగోపాల్ అధికారులతో సమీక్షించారు. ఆగష్టు 15వ తేదీన నెల్లూరు పోలీస్ పెరేడ్ గ్రౌండ్స్‌లో నిర్వహించే జాతీయ పతాక ఆవిష్కరణ, సాంస్కృతిక కార్యక్రమాలు, అదేవిధంగా సాయంత్రం ఐదు గంటల నుంచి వెంకటేశ్వర కస్తూర్బా కళాక్షేత్రంలో నిర్వహించే సాంస్కృతిక కార్యక్రమాలు, వస్తుపంపిణీల వివరాలు అడిగి తెలుసుకొన్నారు. పోలీసుల మార్చ్‌ఫాస్ట్ అనంతరం డిఆర్‌డిఏ, డ్వామా, ఎస్సీ కార్పొరేషన్, ఐటిడిఏ, హౌసింగ్, ఆర్.డబ్ల్యు.ఎస్, రాజీవ్ విద్యామిషన్ తదితర శాఖల శకటాల ప్రదర్శన ఏర్పాటు చేయమన్నారు. మంచినీటి వసతి, శానిటేషన్ తదితర వసతులు చూడమన్నారు. ఈ సమావేశంలో డిఆర్వో జి.వి.జయరామయ్య, నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాల్‌రెడ్డి, డిఎస్పీ రాధిక తదితరులు పాల్గొన్నారు.



ఆగష్టు 15న పెరేడ్ గ్రౌండ్స్‌లో మార్చ్‌ఫాస్ట్ చేస్తున్న పోలీసులు.(ఫైల్‌ఫోటో).

## కలవరపెడుతున్న కళ్ల కలక

సీజనల్ వ్యాధులు ప్రజలను చుట్టుముడుతూనే వున్నాయి. డయేరియా, డెంగ్యూ వ్యాధుల ధాటికి ప్రజలు హడలి పోతుంటే ఇప్పుడు కళ్లకలక మరింతగా ప్రజలను ఇబ్బంది పెడుతున్నది. ప్రతి ఏడాది జూలై చివర, ఆగష్టు మాసం ప్రారంభం నుంచే ఈ కళ్లకలక వ్యాధి ప్రారంభమవుతుంది. దీనిని 'మద్రాస్ ఐ' అని కూడా అంటారు. అడిన్ వైరస్ అనే క్రిమి ద్వారా సంక్రమించే

### కాస్త జాగ్రత్తండీ!

ఆ వ్యాధి సోకినట్లయితే కళ్లు ఎరుపెక్కి నీరుగారడం, మంట పుట్టడం, కనురెప్పలు వాచి కళ్లు తెరవలేకపోవడం వంటి లక్షణాలు వుంటాయి. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నారుల మొదలు పెద్ద వయసుగల వారి వరకు అందరికీ ఈ వ్యాధి సోకడానికి అవకాశం వుంది. అతి వేగంగా సంక్రమించడం ఈ వైరస్ లక్షణం. ఈ వ్యాధి లక్షణాలు కనపడగానే కంటి వైద్యులను సంప్రదించి తగిన జాగ్రత్తలు తీసుకొన్నట్లయితే ఈ బాధ నుంచి త్వరగా బయటపడవచ్చు. కళ్లకలక సోకినవారి కంటి అద్దాలు, చేతి రుమాళ్లు ఇతరులు వాడకుండా వుండాలి. ముఖ్యంగా కరచాలనం చేయకపోవడం వల్ల ఇలాంటి వ్యాధులు సోకకుండా



వుండేందుకు ఆస్కారం వుందని వైద్యులు చెప్తున్నారు. నేరేడు పండ్లతోపాటు కళ్లకలక వస్తుందని గ్రామాల్లో చెప్తుంటారు. మొత్తం మీద కళ్లకలక నగర వాసులను చికాకు పెడుతున్నది.

## మార్కెటింగ్ కేంద్రాలుగా గ్యాస్ ఏజెన్సీలు!

రేషన్‌షాపులు, గ్యాస్ ఏజెన్సీలు నేడు మార్కెటింగ్ కేంద్రాలుగా మారుతున్నాయి. వివిధ సంస్థల ఉత్పత్తులను, నిత్యావసర వస్తువుల అమ్మకాలకు ఇవి రెండూ కేంద్రాలవుతుండటం వివాదాస్పదమవుతున్నది. ప్రస్తుతం సరఫరా చేసే బియ్యం, కిరోసిన్, చక్కెరను విని వీళ్లు క్రొత్త గ్యాస్ కనెక్షన్ల కోసం, అదనపు సిలిండర్ల కోసం వచ్చే వినియోగదారులకు తమ వద్ద గృహోపకరణాలను కొనాలని ఒత్తిడి చేస్తున్నారు. గ్యాస్ స్టౌవ్, ట్యూబ్‌తోపాటు ఎలక్ట్రికల్ కుక్కర్, ప్రెషర్ కుక్కర్లు తమ వద్ద కొనుగోలు చేయాలని, లేదంటే కనెక్షన్ ఇవ్వమని

### అల్లాడుతున్న జనం

యోగదారులకు అందజేయాల్సిన రేషన్‌షాపులు మార్కెటింగ్ ఏజెన్సీలుగా అవతారం ఎత్తాయి. బియ్యం, కిరోసిన్, చక్కెర ఏది ఇవ్వాలన్నా సేమ్యా ప్యాకెట్లు గానీ, సబ్బులు గానీ కొనాలని, లేదంటే సరుకులు ఇవ్వమని లంకె పెడుతుండడంతో విధిలేక వాటిని కొనుగోలు చేయాల్సి వస్తోందని వినియోగదారులు వాపోతున్నారు. రేషన్ షాపులది ఈ దారైతే, గ్యాస్ ఏజెన్సీలది మరోదారి. చెప్తుండడంతో చేసేదిలేక తప్పనిసరై వాటిని కొంటున్నామని వాపోతున్నారు. బయటకొంటే అధికమని, తాము తక్కువ ధరకే వీటిని అందిస్తున్నామని చెప్తున్నారు గ్యాస్ ఏజెన్సీ నిర్వాహకులు. నూనె ప్యాకెట్లు, సర్ఫ్ ప్యాకెట్లు అమ్ముతున్న ఏజెన్సీలు వున్నాయంటే ఎంతగా తమ ఆదాయం కోసం వీరు వినియోగదారులపై భారం మోపుతున్నారో అర్థం చేసుకోవచ్చు.

## ఇరువైపులా చురకత్తులే!

మొదటి పేజీ కొరవ

ప్రాపర్టీస్. చంద్రబాబు నాయుడు అధికారంలో వున్నప్పుడే రంగ ప్రవేశం చేసింది ఈ కంపెనీ. అయితే అప్పటికి హైదరాబాద్ నగర శివార్లలో భూములకు పెద్దగా విలువ లేదు. ఆయా ప్రాంతాలకు పారిశ్రామికులను ఆకర్షించడానికి ఈ కంపెనీని దుబాయి నుంచి దిగుమతి చేసి, వారి చేత హైటెక్ కన్వెన్షన్ మందిరం, ఆధునిక గోల్ఫ్ కోర్టు మైదానం నిర్మింప చేశాడు చంద్రబాబు. అప్పుడు కూడా భూసేకరణ ఏపీఐఐసీ ద్వారానే జరిగింది. అప్పటి ఒప్పందం ప్రకారం, ఆ కంపెనీ అభివృద్ధి చేసే ఆస్తులలో ఏపీఐఐసీకి 49శాతం వాటా వుండేట్లు నిర్ణయం చేశారు. వైఎస్ వచ్చిన తర్వాత ఈ కంపెనీకి ఇచ్చిన భూముల విలువ కొన్ని వందల రెట్లు పెరిగిపోయింది. ఎకరా పది నుండి పదిహేను కోట్ల రూపాయల వరకు ధర పలికింది. దానితో ఏపీఐఐసీని పక్కకు తప్పించి మొత్తం వ్యాపారం ఆ కంపెనీ స్వంతంగా మార్చి పారేశారు. వారి ఇష్టారాజ్యంగా ఖరీదైన విల్లాలు కట్టి అమ్ముకోవడానికి అనుమతించారు. దాదాపు పదివేల కోట్ల రూపాయల ఆస్తి అది. దానితో అటు భూమి ఇచ్చిన రైతులు సర్వనాశనమై పోయారు. ఇటు ఏపీఎల్ఎల్‌సి దివాళా తీసింది.

ఈ కుంభకోణాన్ని బట్టబయలు చేశాడు డిఎల్.రవీంద్రరెడ్డి. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి అవినీతిని నగ్నంగా నిరూపించే కథనమిది. కాంగ్రెస్ అధిష్టానం అనుమతి లేకుండా ఆయన అంత సాహసం చేస్తాడని భావించలేము. జగన్ దూకుడుకు కళ్లెం వేయడానికి కాంగ్రెస్ పెద్దలే వెనుక నుంచి డిఎల్.రవీంద్రరెడ్డి చేత మాట్లాడించి వుంటారని భావిస్తున్నారు. దీని ద్వారా అధిష్టానానికి రెండు రకాల ప్రయోజనాలు లభిస్తాయి. మొదటిది – వైఎస్ ప్రజలకు పథకాలివ్వడమే కాదు, ప్రజల ధనాన్ని దోచుకున్నాడు కూడా అనే ప్రచారం కల్పించి, జగన్ యాత్రలకు వస్తున్న స్పందనను తగ్గించడం. రెండవది – జగన్‌తో ఆర్థిక లావాదేవీలు నడిపే పారిశ్రామికవేత్తలకు హెచ్చరిక జారీ చేయడం.

అయితే జగన్ ఈ సవాలును ధీటుగా ఎదుర్కొంటున్నాడు. తన తండ్రికి ప్రజలలో వున్న మంచి పేరుకు మసి పూయడం కోసమే ఈ కథలల్లుతున్నారని తన పత్రిక ద్వారా, టీవీ ఛానల్ ద్వారా, అంబటి రాంబాబు వంటి అనుచరుల ద్వారా హోరెత్తిస్తున్నాడు. ఆ ప్రచారం ద్వారా అధిష్టానం లక్ష్యాన్ని సాధ్యమైనంత మేర తగ్గించాలన్నది వ్యూహం. ఇటువంటి అవినీతి కథనాలు తనను బెదరగొట్టలేవన్న సందేశాన్ని కూడా పంపగలుగుతున్నాడు జగన్. అంతటితో కూడా ఆగడం లేదాయన. తన తండ్రితో పాటుగా ఇప్పటి ముఖ్యమంత్రి సైతం అవినీతి పనులకు పాల్పడుతున్నాడన్న ప్రచారాన్ని కల్పించేందుకు వెనుకాడడం లేదు. అమీర్‌పేట మైత్రీవనం ఎదురుగా వున్న ఖరీదైన స్థలాన్ని ఒక తెలుగుదేశం నాయకుడికి కట్టబెట్టాడని సాక్షి పత్రిక వెలుగులోకి తెచ్చింది. ఈ లావాదేవీలో ముఖ్యమంత్రి, జెసి.దివాకర్‌రెడ్డికి ప్రమేయం వుందనే ప్రచారాన్ని వ్యాప్తి చేస్తున్నాడు జగన్. తద్వారా తన తండ్రి కాలంలో జరిగిన కుంభకోణాలను బయట పెట్టడానికి ఒకటికి రెండుసార్లు ఆలోచన చేసే పరిస్థితి కల్పించడమే ఆయన ఉద్దేశం. మీరు నా బ్రతుకు బజారున వేస్తే నేను కూడా మీ నీతి ముసుగును తొలగించి వేస్తానన్న హెచ్చరిక జారీ చేస్తున్నాడు జగన్.

ఈ రెండు వర్గాల మధ్య ఈ తీరులో పోరాటం నడిస్తే, పార్టీ మట్టి కొట్టుక పోతుందన్నది సగటు కాంగ్రెస్‌వాదుల ఆవేదన. ఇప్పటికే తెలంగాణ వాదంతో, తెలంగాణ ప్రాంత సీనియర్ల గోలతో పార్టీ చాలా నష్టపోయింది. ఇప్పుడు ఈ అవినీతి కుంభకోణాలతో జగన్ మీద దండోపాయం ప్రయోగిస్తే ప్రజలు కాంగ్రెస్‌ను ఈసడించుకొంటారన్నది వాస్తవం. కానీ అటు అధిష్టానం, ఇటు జగన్‌లు ఇరువురూ ఆ భయాలను లెక్క చేసే స్థితిలో లేరు. ఇరువైపులా చురకత్తులు విసురుతున్నారు. అవి ఇద్దరికీ గుచ్చుకోవడం ఖాయం.

## అంత కక్ష

మొదటి పేజీ కొరవ

పనబాక కృష్ణయ్యకు గూడూరు టిక్కెట్ ఇప్పించడంలోనూ ఆయన సాయపడ్డాడు. నేదురుమల్లి జనార్ధనరెడ్డికి వ్యతిరేకంగా ఆమె నడిపిన జిల్లా రాజకీయంలో పరోక్ష సాయం చేశాడు. అటువంటి రాజశేఖర్‌రెడ్డి మీద ఆమెకు అంత కక్ష ఎందుకో ఎవరికీ అర్థం కావడం లేదు.

## జనవాణి

2వ పేజీ కొరవ

నంత ఖర్చు ఆర్టీసి బస్సుకు వుండదు. ఇవన్నీ అర్థంకాని సమస్యలు.

*టి.కోటేశ్వరరావు, కోవూరు*

### ప్రతిపక్షాలకు ఓటెందుకు వేయాలి?

రాష్ట్రంలో అరాచకం తాండవిస్తోంది. ఏ విషయంపై కూడా రోశయ్య ప్రభుత్వం శ్రద్ధ వహించడం లేదు. పోని ప్రతిపక్షాలు బాగున్నాయంటే వాటి పరిస్థితి ఘోరంగా వుంది. రేపటి స్థానిక సంస్థల ఎన్నికల్లో ఎవరికి ఓటేయాలన్న ధర్మ సందేహం అందరిలోనూ కలుగుతోంది. నెల్లూరు కార్పొరేషన్‌పై పసుపు జెండా ఎగురవేయాలని చంద్రమోహన్‌రెడ్డి కలలు కంటున్నారు. కాని ఆ పార్టీ తరపున గెలిచిన కార్పొరేటర్లు వివేకానందరెడ్డి పక్షాన చేరుతారు. ప్రజారాజ్యానికి ఓటేద్దామంటే శ్రీధరన్న ఇప్పటికే వివేకన్న చంక ఎక్కేశాడు. బిజెపి పరిస్థితి కూడా దీనికి భిన్నంగా లేదు. నాలాగే ఆలోచించే నెల్లూరు ఓటర్లు చచ్చినట్లు కాంగ్రెస్‌కే ఓటెయ్యాలా?

*వాస్తు రామచంద్ర, నెల్లూరు*

### బిఎస్ఎన్ఎల్ దోపిడీ!

నాకు బిఎస్ఎన్ఎల్ సెల్‌ఫోన్ వుంది. నెల రోజుల క్రితం నా సెల్‌ఫోన్ బ్యాలెన్స్ అమౌంట్‌లో 50 రూపాయలు తగ్గాయి. మళ్లీ ఈ నెల 1తేది టాలీవుడ్ క్రికెట్ మ్యాచ్ సమాచారం అందించిన పద్దుకంటూ నా అనుమతి లేకుండా మళ్లీ 50 రూపాయలు తీసుకొన్నారు. బిఎస్ఎన్ఎల్ ఆఫీసులో విచారిస్తే అన్ సబ్‌స్క్రైబ్ చేశామంటూ వచ్చే నెల నుంచి తగ్గుతుందని చెప్పారు. వినియోగదారుల అనుమతి లేకుండా ఈ విధంగా కట్ చేయడం మోసం. ప్రభుత్వ రంగ సంస్థ అయిన బిఎస్ఎన్ఎల్ ఇలా చేస్తే ఎలా?

*టి.సుధాకర్‌రెడ్డి, నెల్లూరు*




## ఇదో కొత్త పద్ధతి

కాంగ్రెస్‌లో వర్గాలు, వాటి మధ్య కుమ్ములాటలు కొత్త కాదు. ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీల కాలంలో ఏ రాష్ట్ర ముఖ్యమంత్రీ ప్రశాంతంగా బ్రతకనిచ్చేవారు కాదు. అసమ్మతి పేరిట ఢిల్లీకి వచ్చే నేతలు చెప్పే చాడీలు వినడం ద్వారా ముఖ్యమంత్రులను ఎప్పుడూ అభద్రతా భావంతో నలపడం కాంగ్రెస్ సంస్కృతి. అయితే ఏ రోజూ కూడా ఢిల్లీ పెద్దలు ఏ రాష్ట్రంలోనూ నేరుగా తంపులు పెట్టే పని చేసేవారు కాదు. వీరు తగవులాడుకొంటే, దాన్ని తమ్ములాటగా పెంచడం వరకే వారి పాత్ర. కానీ ఇప్పుడు కొత్త పద్ధతి అమలులోకి వచ్చింది. వైఎస్ జగన్ వ్యతిరేక ప్రచారానికి ఏఐసిసి అధినేతలు స్వయంగా నిప్పు రాజేస్తున్నారు. సోనియా రాజకీయ కార్యదర్శి అహ్మద్ పటేల్ రాష్ట్రం నుంచి జగన్‌ను ఇరకాటంలో పెట్టే కథలు, కథనాలను సేకరించడంతో పాటు, వాటిని ధ్రువపరచుకోవడానికి ప్రభుత్వ ఫైళ్లను కూడా ఢిల్లీకి తెప్పించుకొని చూస్తున్నాడట. ఏపీఐఐసీ ఫైల్‌ను బొత్సా సత్తిబాబు ఆయనకు తీసుకవెళ్లి చూపించడం ఇందుకొక ఉదాహరణ. జగన్ దూకుడును నిలువరించడంలో రోశయ్య తాము అనుకొన్న మేర పని చేయలేక పోతున్నాడనే అసంతృప్తితో, ఢిల్లీ పెద్దలే ఆ పుణ్యం కట్టుకొంటున్నారట. అయితే స్వయాన పార్టీ అధినేతలే ఇట్లా పార్టీని గబ్బు పట్టించే చర్యలకు పూనుకోవడం ఎక్కడకు దారితీస్తుందో అని చింతిస్తున్నారు కాంగ్రెస్ సీనియర్లు.

## జనసంద్రంలో తేలియాడింది

16వ పేజీ కొరవ

చిరు నెల్లూరు పర్యటనలో పెద్ద విశేషం, కాంగ్రెస్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి సత్కారం. పెన్నా వారధి దగ్గర నుంచి నగరంలోకి వస్తున్న చిరంజీవిని ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి రంగనాయకుల స్వామి గుడిలోకి తీసుక వెళ్లాడు. లోపలకు వెళ్లేసరికి పూల దండ, శాలువాలు పట్టుకొని వివేకానందరెడ్డి, భానుశ్రీ సమేతంగా నిలబడి వున్నారు. వారిని చూసి ఆశ్చర్యపోయాడు చిరంజీవి. ఈ రహస్య సమాగమం దేనికో ఆయనకు అర్థం కాలేదు. చిరంజీవిని దుశ్శాలువాతో పాటు, భట్రాజు పొగడ్తలతో ముంచెత్తాడు వివేకా. ఏదో ఒక మర్మం లేనిదే తన పార్టీకాని నాయకుడికి ఇంత స్వాగత సత్కారం చేయడు. అదేమిటో మనకు తెలియదు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

వానికి ఈ దర్గా సందర్శనకు ఇటువంటి వస్త్రధారణ నియమం లేదు. దేశంలో మహిళలను గూడా అనుమతించే ఏకైక దర్గా బారాషహీద్‌దర్గా. దర్గాలో పూజారి కూడా చిరంజీవి అభిమానిలా వున్నాడు. ఆయన కూడా చిరంజీవి ముఖ్యమంత్రి కావాలని ఆశీర్వదించాడు.

### తిరిగొచ్చిన జె.సి

శాఖాపరమైన శిక్షణ నిమిత్తం రెండు నెలల క్రితం ముస్సోరి వెళ్లిన జాయింట్ కలెక్టర్ సౌరభ్ గౌర్ నెల్లూరుకు తిరిగి వచ్చారు. 12వ తేది బాధ్యతలు స్వీకరించారు.

### నడిరోడ్డుపై దొంగతనం!

నెల్లూరు నగరంలో దొంగతనాలు మరీ ఎక్కువై పోయాయి. 9వ తేది బాలాజీనగర్ పుట్ట వీధికి చెందిన బాబు ట్రంకురోడ్డులోని అశోకా లాడ్జి వద్దకు పనిపై వచ్చారు. ఆయన కారు వెనుక సీటులో డబ్బున్న బ్యాగ్‌ను గమనించిన అగంతకుడొకడు పాత పద్ధతిలోనే క్రింద డబ్బులు పడ్డాయని బాబుకు చెప్పి వాటి కోసం ఆయన వంగగా బ్యాగ్‌తో ఉడాయించాడు. ఈ బ్యాగులో రెండు లక్షల రూపాయల నగదు, 13 గ్రాముల బం గారు ఆభరణాలున్నట్లు పోలీసులకు ఫిర్యాదు అందింది. నగరంలో వరుస దొంగతనాలకు క్రైం పోలీసులు సైతం సతమతమై పోతున్నారు.

### నెల్లూరులో డాక్టర్ శ్రీనాథ్‌రెడ్డి

ప్రపంచ ప్రఖ్యాత గుండె వైద్యుల్లో ఒకరైన నెల్లూరీయుడు, ఢిల్లీలోని ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ సంస్థ మాజీ గుండె విభాగం అధిపతి డాక్టర్ కె.శ్రీనాథ్‌రెడ్డి 8వ తేది నెల్లూరుకు వచ్చారు. బిజెపి నేత వెంకయ్యనాయుడు ఆహ్వానంపై స్వర్ణభారత్ ట్రస్ట్ ఆవరణలో జరిగిన ఉచిత వైద్యశిబిరంలో వందలాది మంది రోగులను ఓపిగ్గా చూశారాయన. ఒకానొక దశలో కరెంట్ పోయినా గాలి ఆడని పరిస్థితుల్లోనూ ఆయన సీటులో కూర్చొని అందించిన వైద్యసేవలు వృత్తి పట్ల ఆయకున్న నిబద్ధతను చాటాయి.

# సందిగ్ధావస్థలో విద్యార్థుల జీవితం

ప్రభుత్వం నుంచి ఫీజు రీ ఎంబర్స్‌మెంటు, ఉపకార వేతనాలు అందకపోవడంతో పలువురు విద్యార్థుల జీవితం సందిగ్ధంలో పడింది. ప్రభుత్వం నుంచి ఫీజు రీ ఎంబర్స్‌మెంటు వుంటుందన్న కొండంత ఆశతో చదువుకొనేందుకు సిద్ధమైన పేద విద్యార్థులకు ఇప్పుడు చదువు కొనసాగించడం కష్టంగా మారింది. ఒకవైపు ప్రభుత్వం నుంచి ఫీజు రీ ఎంబర్స్‌మెంటుకు సంబంధించిన చెల్లింపు జరపకపోవడంతో యాజమాన్యాలు కళాశాలలు వదలి వెళ్లమని ఒత్తిడి చేస్తుండడంతో ఏమిచేయాలో పాలుపోని స్థితిలో వున్నారు.

జిల్లావ్యాప్తంగా సాంఘిక సంక్షేమ శాఖకు సంబంధించి 250 మంది విద్యార్థులకు 30 లక్షల రూపాయల దాకా ఉపకార వేతనాలు, రెండువేల మంది వరకు మూడు కోట్ల రూపాయల ఫీజు రీ ఎంబర్స్‌మెంటు రావాల్సి వుంది.

**ప్రభుత్వం నుంచి రీ ఎంబర్స్‌మెంటు వుంటుందన్న ఆశతో వివిధ కోర్సులలో చేరిన పేద, మధ్యతరగతి కుటుంబాలకు చెందిన విద్యార్థులకు నిధులు విడుదల కాకపోవడం ప్రాణాంతకంగా పరిణమించింది.**

నిధులు విడుదల కాకపోవడం, మరోవైపు కళాశాలల యాజమాన్యాలు ఫీజులు కట్టమని ఒత్తిడి చేస్తుండడంతో విద్యార్థుల పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా మారింది. బిసి, మైనార్టీ, ఎస్సీ, ఎస్టీ విద్యార్థులందరిదీ ఇదే పరిస్థితి. ఉన్నత చదువులు చదవాలన్న కోరిక వున్నా ఫీజు రీ ఎంబర్స్‌మెంటు జరగకపోవడంతో చదువులకు దూరం అవుతున్నారు. ఇంజనీరింగ్‌లో చేరినవారు ఫీజు చెల్లించలేని పరిస్థితుల్లో కూలీలుగా మారుతున్నారు. ప్రైవేట్ కళాశాలల్లో రెండవ సంవత్సరం చదివే విద్యార్థులు మొదటి సంవత్సరం ఫీజు తిరిగి బిసి విద్యార్థులకు సంబంధించి 11,288 మందికి 1.13 కోట్ల స్కాలర్‌షిప్పులు, 14.61 కోట్ల మేర ఫీజు రీ ఎంబర్స్‌మెంటు అందాల్సి వుంది. ఇబిసి విద్యార్థులు క్రొత్తగా దరఖాస్తు చేసుకొన్నవారు 11,084 మంది వున్నారు. వీరికి 4.41 కోట్ల రూపాయల ఉపకార వేతనాలు, 58 లక్షల రూపాయల ఫీజు తిరిగి చెల్లింపులకు రావాల్సి వుంది.

గత విద్యా సంవత్సరం పూర్తయినప్పటికీ ఇంతవరకు రీ ఎంబర్స్‌మెంటు జరగకపోవడంతో



అయోమయంలో వృత్తి విద్యా కోర్సులు చదివే విద్యార్థులు.

విద్యార్థుల పరిస్థితి అగమ్యగోచరమైంది. జిల్లాలో ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీ వర్గాల విద్యార్థులు 50 వేల మంది వరకు ఇంటర్మీడియట్, డిగ్రీ, పిజి, ఇంజనీరింగ్, మెడికల్ కోర్సులను చేస్తున్న వారికి ఉపకార వేతనాలు, ఫీజు రీ ఎంబర్స్‌మెంటు సక్రమంగా అందకపోవడంతో చదువులు కొనసాగించలేని పరిస్థితి నెలకొంటున్నది. తొలినాళ్లలో సజావుగా సాగిన ఈ విధానం కాలక్రమేణా నిధులు విడుదల కాకపోవడంతో జాప్యం జరుగుతుండడంతో చదువులు అర్థాంతరంగా ముగించలేక, కొనసాగించలేక తీవ్రమైన మానసిక ఒత్తిడిని ఎదుర్కోవాల్సి వస్తోంది. ఫీజు రీ ఎంబర్స్‌మెంటు అమలు చేసినప్పుడు ఇది పేద విద్యార్థులకు ఎంతో ప్రయోజనకరం అని, వారి ఉన్నత విద్యాభ్యాసానికి దోహదపడుతుందని చెప్పిన పాలకులు ఆచరణలో చతికిల బడడంతో విద్యార్థులకు కష్టతరంగా పరిణమించింది.

# వైద్యఆరోగ్య శాఖలో సరికొత్త ప్రయోగమే క్లస్టర్ల ఏర్పాటు!

రాష్ట్రప్రభుత్వం ప్రజలకు మెరుగైన వైద్య సేవలు అందించాలన్న సంకల్పంతో కమ్యూనిటీ హెల్త్ న్యూట్రిషియన్ కేంద్రాల ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది. 73వేల నుంచి లక్షా 50వేల మంది జనాభాకు కలిపి ఒక క్లస్టర్ ఏర్పాటు కానుంది. 30 పడకల ఆసుపత్రులను కూడా ఈ క్లస్టర్ కేంద్రాల పరిధిలోకి తీసుకురానున్నారు.

ప్రస్తుతం జిల్లాలో 3వేల జనాభాకు ఒక ఎఎన్ఎంను వైద్య ఆరోగ్యశాఖ నియమించి వుంది. 5వేల జనాభాకు ఒక సబ్‌సెంటర్, 30 వేల జనాభాకు ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం (పిహెచ్‌సి) వున్నాయి. ప్రభుత్వం వైద్యఆరోగ్య శాఖలో నూతనంగా ఏర్పాటు చేయనున్న క్లస్టర్లలో అయిదు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను కలిపి ఒక క్లస్టర్‌గా ఏర్పాటు చేయాలని ఉత్తర్వులు కూడా జారీ అయ్యాయి. దీంతో సబ్ సెంటర్లు, పిహెచ్‌సిలలో విధులు నిర్వహించే సిబ్బంది క్లస్టర్ కేంద్రాల్లో పని చేయాల్సి వుంటుంది.

ఇప్పటికే జిల్లాలో అంటువ్యాధులు వ్యాపించి ప్రజలు అనారోగ్యం పాలైవున్నారు. జిల్లావ్యాప్తంగా వున్న వైద్య ఆరోగ్యశాఖ సిబ్బంది, వైద్యులు సక్రమంగా విధులు నిర్వహించడం లేదన్న ఆరోపణలు అనేకం వున్నాయి. పట్టణ ప్రాంతాల్లో నివాసం వుంటూ గ్రామీణ ప్రాంతాలలో విధులకు డుమ్మా కొడుతున్న వైద్యులు లేకపోలేదు. వారానికి రెండు రోజులు గ్రామాలను సందర్శించాల్సిన ఎఎన్ఎంలు నెలకొకసారి కూడా పల్లె ముఖాన్ని చూడడం లేదు.

వైద్య సిబ్బంది అందుబాటులో వుంటున్న సమయంలో వైద్యసేవలు అందడం లేదు. క్లస్టర్ కేంద్రాలను లక్షా 75వేల జనాభాకు అనుకూలంగా వుండే ప్రాంతంలో ఏర్పాటు చేస్తారు. దీంతో ఏదైన అనారోగ్యం కలిగితే గ్రామీణ ప్రాంతాల ప్రజలు ఈ కేంద్రానికి వెళ్లేందుకు ఇబ్బంది పడాల్సి వుంటుంది. ఈ కేంద్రాలలో వైద్యసేవలు అందించడంతోపాటు గర్భిణి, బాలింతలకు ఆహార పదార్థాలు, పౌష్టికాహారం తీసుకోవడం పట్ల సూచనలు, సలహాలు ఇవ్వనున్నారు. ఇందుకు అవసరమైన వైద్యులు, ఇతర సిబ్బందిని నియమించాల్సి వుంటుంది.

**జనాభా ప్రాతిపదికన జిల్లాలో 75 క్లస్టర్ల ఏర్పాటుకు రంగం సిద్ధం చేశారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో పనిచేసే సిబ్బంది, వైద్యులు ఇక్కడే పనిచేయాల్సి వుండడం వల్ల వీటి మనుగడ ప్రశ్నార్థకమే.**

కమ్యూనిటీ హెల్త్ న్యూట్రిషియన్ సెంటర్లను ఏర్పాటు చేసుకోవాలని వైద్య ఆరోగ్యశాఖ కార్యదర్శి పి.వి.రమేష్ జిల్లా అధికారులను ఆదేశించారు. జిల్లా అధికారులు క్లస్టర్ కేంద్రాల ఏర్పాటుపై సన్నాహాలు చేస్తున్నారు. మొత్తం జిల్లాలో 75 క్లస్టర్లను ఏర్పాటు చేసేందుకు ప్రణాళిక తయారు చేశారు. జనాభా ప్రాతిపదికను ఆధారం చేసుకొని వీటిని ఏర్పాటు చేయాల్సి వుంటుంది. కమ్యూనిటీ హెల్త్‌పై కొంతమంది వైద్యులకే అవగాహన లేకుండా పోయింది. ఈ కేంద్రాలలో విధులు నిర్వహించే సిబ్బంది కూడా శిక్షణ ఇవ్వాల్సి వుంటుందని వైద్యులు అంటున్నారు.




సరికొత్త ప్రయోగానికి సిద్ధమైన వైద్యఆరోగ్య శాఖ. (ఫైల్‌ఫోటో).

నూతనంగా ఏర్పాటు చేసే క్లస్టర్ కేంద్రాల వలన ప్రజలకు వైద్యసేవలు అందడం కష్టతరంగా వుంటుంది. ఈ కేంద్రాలు ఏర్పాటు చేస్తే పిహెచ్‌సి పరిధిలో వుండే సిబ్బంది, వైద్యులు మొత్తం ఈ కేంద్రంలోనే పనిచేస్తారు. అప్పుడు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు నిర్వీర్యమైపోతాయి. ఏది ఏమైనా వైద్య ఆరోగ్యశాఖ ఏర్పాటు చేస్తున్న క్లస్టర్ కేంద్రాల వలన ఎటువంటి ప్రయోజనం చేకూరుతుందన్నది కొన్నాళ్లు వేచిచూస్తే గానీ అర్థం కాదు.

# రోశయ్య మెడకు యమపాశం!

ఏపీఐఐసీ వంటి కుంభకోణాలు వైఎస్ హయాంలో లెక్కలేనన్ని జరిగిన నిజాన్ని ఎవరూ కాదనలేరు. ప్రతిపక్షాలు, పత్రికలు వీటిపై ఎప్పటికప్పుడు ఇల్లెక్కి గోల చేసినా ఆయన పట్టించుకోలేదు. పైపెచ్చు వారి నోరు మూయించడానికి తూతూ మంత్రం విచారణలు జరిపించేవాడు. మంత్రులతో సబ్ కమిటీలు నియమించి, అంతా బాగున్నదనే సర్టిఫికేట్ ఇప్పించేవారు. వాటికి పెద్దరికం రోశయ్యకు అప్పచెప్పేవారు. ఇట్లా ఏర్పాటైన 18 ఉప సంఘాలకు రోశయ్య అధ్యక్షుడిగా పని చేశాడని తెలుస్తున్నది. వాటిలో ఎమ్మార్ ప్రాపర్టీస్ వివాదం కూడా ఒకటి. వైఎస్ అనుమతితోనే అవినీతి మొత్తం జరిగినా ఏ ఫైల్ మీదా ఆయన సంతకం పెట్టలేదు. ఆ అవసరం కూడా రాలేదు. ఏపీఐఐసీ స్వతంత్ర ప్రతిపత్తి కల్గిన సంస్థ కాబట్టి, ముఖ్యమంత్రి సంతకంతో పని లేకుండానే వేల ఎకరాల భూమి పరాధీనం చేసింది. అయితే వీటిపై ఏర్పడిన ఉప సంఘాలు మాత్రం క్యాబినెట్‌కు నివేదికలు ఇవ్వాలి. లాంఛనం ప్రకారం ఉప సంఘాల అధ్యక్షుడిగా రోశయ్య ఆ నివేదికల మీద సంతకం పెట్టేవారు. ఇప్పుడు చిక్కంతా అక్కడే వచ్చింది.

ఎమ్మార్ ప్రాపర్టీస్ కుంభకోణం వెలికి రాగానే జగన్ అనుచర మంత్రులు కొందరు ఆ ఉప సంఘం నివేదిక పత్రాలను తెప్పించి, అందజేశారట. ఒకవేళ ముఖ్యమంత్రి దీనిపై విచారణకు ఆదేశిస్తే, రోశయ్య సంతకం వున్న పత్రాలను బయటపెట్టి ఇరుకున పెట్టాలన్నది వారి వ్యూహం. అదే జరిగితే ముఖ్యమంత్రి ఇబ్బందులలో పడిపోతాడు. వైఎస్ అవినీతిలో తనకు వాటా వున్నా లేకపోయినా ప్రజలకు సంజాయిషీ ఇచ్చుకోవల్సిన దీన స్థితి ఎదుర్కొంటాడు. డీఎల్ రవీంద్రరెడ్డి గలభా అటు తిరిగి, ఇటు తిరిగి తన మెడకు యమపాశంగా చుట్టుకొనే ప్రమాదం కన్పించడంతో తీవ్రంగా ఆందోళన చెందుతున్నాడాయన.

## కార్టూన్ స్కోప్




ఇతనికి సోకింది... స్వైన్‌ఫ్లూ కాదయ్యా! 'చిరు'ఫ్లూ...!!

● చుక్కాని లేని చిరు నావ

# జనసంద్రంలో తేలియాడింది!

ప్రజారాజ్యం అధినేత చిరంజీవి వున్నట్లుండి వీధులలోకి వచ్చాడు. ప్రజా చైతన్య యాత్ర పేరుతో ఆయన నెల్లూరు జిల్లాలో జరిపిన పర్యటనకు ప్రజల నుంచి అనూహిత స్పందన లభించింది. ఏడాది క్రితం ఎన్నికలలో చిరు పార్టీకి ఓటు వేయడానికి ఎంత మాత్రం సుముఖత చూపని జనం, ఆయన్ను చూడడానికి మాత్రం పొర్ల బడి వచ్చారు. కావలి నుంచి వెంకటగిరి వరకు ఎక్కడ చూసినా జన సముద్రాలే. సాధారణ రాజకీయ సభల వలె వాహనాలు ఏర్పాటు చేయలేదు, మందు సీసా, బిర్యానీ పొట్లం ఇవ్వలేదు, ఆటోలకు మైక్ తగిలించి ప్రచారంతో వూదరగొట్టలేదు. అయినా జనం వచ్చారు. చిరు ఎప్పుడు ఏ వీధికి వస్తాడో తామే తెలుసుకొని గంటల తరబడి ఎదురు చూశారు. ఆయన సినీ గ్లామర్ ఏ మాత్రం తగ్గలేదని రుజువు చేసింది ఈ పర్యటన.



కావలి రోడ్‌షోలో మాట్లాడుతున్న ప్రజారాజ్యం పార్టీ అధ్యక్షుడు చిరంజీవి.

నిజానికి చిరంజీవి ఈ చైతన్య యాత్ర ఇప్పుడు ఎందుకు తలపెట్టాడో ఎవరికీ తెలియదు. ప్రజారాజ్యం పార్టీ వారికి కూడా అదొక చిక్కు ప్రశ్నే. యాత్ర ద్వారా ఆయన సాధించేది కూడా ఏదీ లేదు. ఇప్పట్లో ఎన్నికలు లేవు. పార్టీని బలోపేతం చేయడానికి వ్యవస్థాపరమైన నిర్మాణం జరగలేదు. పిఆర్‌పి ఎమ్మెల్యేలు కాంగ్రెస్‌తో మమేకమై పోయి వున్నారు. అభిమానులు బిక్కముఖాలతో ఎమ్మెల్యేల ఇంటి గేటు బయట నిలబడిపోయి వున్నారు. మరొకప్రక్క చిరంజీవికి రాజకీయ లక్ష్యం అంటూ ఏదీ లేదు. ముఖ్యమంత్రి రోశయ్యతో, కాంగ్రెస్ అధిష్టానంతో ఆయన సత్సంబంధాలు నెరపుతున్నాడు. అందువల్ల అధికార పార్టీని విమర్శించే అవకాశం లేదు. వైఎస్.జగన్‌ను ఢీకొనే ధైర్యం లేదు. నాకెందుకొచ్చిన చీకాకన్నది ఆయన అభిప్రాయం. అప్పటికీ కావలిలో పత్రికల వారి ముందు అన్యాపదేశంగా జగన్‌పై కొన్ని వ్యాఖ్యలు చేశాడు. టాటాలు, అంబానీల వంటి పారిశ్రామిక మేధావులే ఏళ్ల తరబడి శ్రమిస్తే తప్ప ఒక దశకు రాలేక పోయారు. కానీ "రాజకీయ వారసుడు" మాత్రం మూడేళ్లలో వేల కోట్లు సంపాదించాడు. ఈ కిటుకు ఏమిటో అందరికీ చెప్తే ప్రజలు కూడా ఆయన వలె కోటీశ్వరులు అవుతారు కదా అని వ్యంగ్యంగా మాట్లాడాడు. దీనిపై జగన్ వర్గం విరుచుకపడింది. ఆ ధాటికి బిత్తర పోయాడు చిరంజీవి. నేను జగన్‌ను ఉద్దేశించి అనలేదని చెంపలేసుకొన్నాడు. అంత పిరికితనంతో ఆయన రాజకీయ పార్టీని ఎట్లా నడుపుతాడో అర్థం కాని సమస్య.

ఒక్క మాటలో చెప్పాలంటే చిరంజీవి యాత్ర చుక్కానిలేని నావ వంటిది. దానికొక గమ్యం లేదు, లక్ష్యం లేదు. అయినాసరే చిరు పట్ల మోజు వున్న ప్రజలు ఆయన్ను సాదరంగా స్వాగతించారు. చుక్కాని లేని నావ అయినా జన సముద్రంలో తేలియాడింది.

కావలిలో, మొన్నటి ఎన్నికల అభ్యర్థి రామిరెడ్డి ప్రతాప్‌రెడ్డి ఆతిథ్యంలో బస చేశాడు. రోడ్ షో అద్భుతంగా జరిగింది. కావలి మునిసిపాలిటీ మురికి కూపం స్థితి నుంచి రోశయ్య ప్రభుత్వం రేషన్ కార్డుల దగా వరకు అన్నిటినీ ప్రస్తావించి ఉద్వేగంగా మాట్లాడాడు. మద్యపాన నిషేధానికి స్ఫూర్తి ఇచ్చిన సింహపురి గడ్డ నుంచి మరొకసారి మద్య వ్యతిరేక ఉద్యమం నడపాలని వుందని అభిలషించాడు. కావలి సభలో మాటల మాంత్రికుడు మణి చేసిన ప్రాసయుక్త ప్రసంగం చిరంజీవిని అచ్చెరువులో ముంచెత్తింది.

నెల్లూరులో ఆయన పెన్నా వారధి దగ్గర ధర్నా నిర్వహించాడు. వారధి పాడుపడి పోకముందే కొత్త నిర్మాణం పూర్తి చేయాలన్నది ధర్నా ఉద్దేశం. ఏళ్ల తరబడి పనులు జరగకపోవడంతో పెన్న వారధి ఉనికి ప్రమాదంలో పడిపోయివుంది. ధర్నాకు జనం పెన్న వరద వలె వచ్చారు. నెల్లూరు నగరంలో అభిమానులకు పార్టీ పరంగా అన్యాయం జరుగుతున్న విషయం నిజమే అని, ఇక ముందు ఆ పొరపాటు జరగకుండా చూసుకోవాలని తన పార్టీ ఎమ్మెల్యే శ్రీధరకృష్ణారెడ్డికి సలహా ఇచ్చాడు.

కొరవ 14వ పేజీలో

# బావమరుదులతో తంటా!

అంతఃకలహాలతో కాంగ్రెస్ అతలాకుతలమై పోతున్న సమయంలో ప్రధాన ప్రతిపక్షంగా తెలుగుదేశం పార్టీ జవసత్వాలను పుంజుకోవడం సహజంగా రాజకీయ పరిణామం. కానీ అదే జరగడం లేదిప్పుడు. కాంగ్రెస్ పతనావస్థను ఎంతమాత్రం లాభసాటిగా మలచుకోలేక పోతున్నాడు చంద్రబాబు నాయుడు. కాంగ్రెస్‌తో సమానంగా ఆయన్ను సైతం సవాలక్ష సమస్యలు పీడిస్తుండడం అందుకొక కారణం. తెలంగాణ ఉప ఎన్నికలు ఆ పార్టీని నీరసింప చేశాయి. ఆ ప్రాంతం నేతలు నవ్వలేక ఏడ్వలేక నలిగి పోతున్నారు. విషణ్ణ వదనాలతో కన్పిస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలో కూడా పరిస్థితి ఎంత మాత్రం బాగాలేదు. ఈ బాధలు చాలావన్నట్లు స్వంత బావమరదులతో లేనిపోని తంటాలు వచ్చి పడుతున్నాయి. తన పార్టీలో తాను గీసిన గీత ఎవరూ దాట కూడదన్నది చంద్రబాబు కోరిక. ఎంతో సీనియర్లను కూడా చిన్న పిల్లల వలె మందలిస్తుంటారాయన. కానీ హరికృష్ణ దగ్గరకు వచ్చేసరికి ఆ పప్పులు పని చేయడం లేదు. హరికృష్ణ స్వతహాగా తొందరపాటు స్వభావి. ఆవేశం వస్తే ఆపుకోలేడు. మొన్న బాబ్లీ విషయంలో అట్లనే గొడవ సృష్టించాడాయన. ఇప్పుడు తాజాగా టిఆర్ఎస్ అధినేత కెసిఆర్‌కు బహిరంగలేఖ వ్రాసి లేనిపోని తలనొప్పి తెచ్చి పెట్టాడు. ఆ లేఖను సాకుగా చూపి, నానా తిట్లు తిట్టాడు కెసిఆర్. ఏపీఐఐసీ కుంభకోణంలో చంద్రబాబుకూ వాటా వుందని నిందించాడు. తనతో మాట మాత్రం మాట్లాడకుండా హరికృష్ణ స్వతంత్రించి నిర్ణయాలు తీసుకోవడం బాబుకు కంటగింపుగా వుంది. కానీ చేయగల్గింది ఏదీ లేదు. హరికృష్ణ ఎవరి మాటా వినడు. ఆయన్ను వదులుకోవడం వీలు కాదు, నియంత్రించడం అసలే జరగదు. మధ్యలో నలిగి పోతున్నాడు పాపం... చంద్రబాబు.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.